

'విసరడం'

చిత్రకారుడు—శ్రీ కళ్యాణ్ ప్రసాద్ శర్మ (విజయనగరం)

# ఇప్పుడు

## మీకు ప్రియమైన ఆరోగ్యముచేకూర్చే విటమినులు కలిసిన వాటర్‌బరీస్ కాంపౌండ్ తీసుకోండి

భారతదేశమందు మిక్కిలి ప్రియమగు, అమూల్యమైన విటమినులతో కూడిన టానిక్కును మీరు యిప్పుడు కొనగలరు. ప్రఖ్యాతి గాంచిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఫార్ములాలో ఆరోగ్యమును, పుష్టిని కలిగించెడు అనేక విటమినులు చేర్పబడినవి. వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్ మీకు అనేక విధములుగా మేలు కలుగజేయును. ఇది రక్తమును వృద్ధిచేసి, కోల్పోయిన శక్తిని మరల చేకూర్చి, మీకు ఉత్సాహము నిచ్చును. ఇది నరములకు సత్తువ కలుగజేసి కండరముల అభివృద్ధికి తోడ్పడుటయేగాక వ్యాధులను కూడా నిరోధించును. జబ్బు చేసిన తరువాత త్వరగా స్వస్థత పొందుటకు యిది చాలా సహాయపడును.

పిల్ఫర్-ప్రూఫ్ కేసరి రంగుగల మూత ఉన్నదా అని చూడండి




కేసరి రంగు లేబిలు ఉన్నదా అని చూడండి.

## వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్

మీ ఆహార పోషణను పూర్తిచేయును.

దగ్గు, జలుబులకు క్రియోసోట్ మరియు గ్వైకాల్‌తో కూడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ ఎఱ్ఱ లేబిల్ గల సీసాలో కూడా లభించుచున్నది.



రచనలు ప్రచురించిన ఆంధ్ర సచిత్ర వార
పత్రికకు నా ధన్యవాదములు.

డి. పాపయ్య (ఆదవాని)

* * *

### కవితా కింకిణి

మీరు క్రొత్తగా ప్రవేశపెట్టిన "కవితా కింకిణి" శీర్షిక మీ పత్రికకు ఒక నూతన శోభను చేకూర్చుచున్నది. నివురుగప్పిన నిప్పువలె ఉన్న భావకవిత్వము మీ "కవితా-కింకిణి" ద్వారా బయటపడి ప్రకాశించుచున్నది. "కవితాకింకిణి" ద్వారా ఎంతోమంది మరుగుపడి ఉన్న బాలకవులు, కవయిత్రులు పాఠకలోకానికి, కావ్యలోకానికి పరిచయ మవుతున్నారు. ఈ "కవితాకింకిణి" యను శీర్షికను ప్రవేశపెట్టి మీ పత్రికలో కవిత్వానికి శాశ్వత స్థానాన్ని కల్పించిన మీకు నా కృతజ్ఞతాభివందనములు. మీ పత్రిక చిరకాలము పాఠకలోక ఆదరాభిమానములను చూరగొనుగాతయని వేంకటేశ్వరుని ప్రార్థించుచున్నాను.

జె. జి. మూర్తి (తిరుపతి)

* * *

### పారిపోయిన శవం

నాకు ఒక్క సందేహము వచ్చింది. 20-7-60 నాటి వారపత్రికలో బి. వి. సత్యమూర్తిగారు వ్రాసిన 'పారిపోయిన శవం'లో హంతకుడు పోలీసు ముఖంమీద బండతో ఆనవాలు లేకుండా కొట్టి చంపి, అతని యూనిఫారమును (హంతకుడు) ధరించాడు. అప్పుడు ఆ యూనిఫారంమీద రక్తం మరకలు లేవా?

బి. మణి (హైదరాబాదు)

* * *

### బెన్ - హర్

పత్రిక అంటే చిరాకుపడే మా నాన్నగారు ఈ వారం "బెన్-హర్" ముఖచిత్రం చూడగానే ఎంతో అభిమానంగా పుస్తకం తీసుకొని పేజీలు త్రిప్పుతూ "బెన్-హర్" కథ అంతా చదవడం మొదలుపెట్టి చాలా చాలా మెచ్చుకొన్నారు. ప్రతివారం చదువుతాను అని అంటున్నారు. మా నాన్నగారికి ఈ వారం పత్రిక "బెన్-హర్" సీరియల్ ఉన్న మూలాన నచ్చింది. ప్రచురించిన రచయితకు నా (మా) ధన్యవాదములు.

మిస్ బేగంజాన్ (అమలాపురము)

* * *

8-8-60 తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో వేసిన 'బెన్-హర్' చిత్రము వ్యాసము చాలా బాగున్నవి. వచ్చే సంచికలో ఇంకా ఎక్కువ ఈ చిత్రంలోని సన్నివేశాల ఫోటోలు వేయవలసిందిగా కోరుతున్నాను.

పి. చిన్నారావు (సామర్లకోట)

* * *



# నీ కోసం

"మాల్యశ్రీ"

పెంచి - పోషించి - వలపులవల్లి త్రెంచి,
దూరము నకేగి - యూరించి - దుర్భరంపు
విరహానలాగ్ని కీలల వ్రేల్చెదేల?
ఎంత కోపము! కరుణ యొకింత లేదె!

నీలి నీలాల నీలోచనాలయందు
కెంపు సొంపుల కోపరేఖికలు రేగ
నిలువగలనటె? నీ మోముల నిర్భయముగ
నిశ్చలంబుగ ప్రాణముల్ నిలచియుండ.

అమృత నిష్యంద మృదు మధు రార్ద్రహసిత
ముగ్ధ లీలాధరమ్ములు ముడివడంగ
నించియున్ - తీక్షణ వీక్షణములను బరపు
నిన్ను గని తాళగలనటే? నీరజాక్షి!

తప్పు లున్నను మన్నించి, తరళనయన!
మంద మందస్మిత మధుమరందరాగ
శీతల కటాక్ష వీక్ష శ్రీలతోడ
నన్ను లాలింపు మో చెలీ! యెన్ని యేని
త్యాగములు చేయనుంటిని నీ గురించి.

## కవితా కింకిణి

☆ బహుమతి పొందిన కవిత ☆

## ఆరేళ్ళ ప్రాయం ఉన్న ఆంధ్రప్రదేశ్ లో

# నాడులు మూడయినా మూడుకోట్లమంది మనసులు ఒకటి కావడమే ముఖ్యం

జె. వి. శర్మ

1953 అక్టోబరు ఒకటవ తేదీన ఆంధ్ర రాష్ట్రముగా ఏర్పడి మూడేళ్ళ అనంతరం 1956 నవంబరు 1వ ఆంధ్ర ప్రదేశ్ అనే పేరుతో రూపొందిన విశాలాంధ్ర పటమును చూస్తే దానికి ప్రాచీనచరిత్ర గల్గిన మూడు ప్రాంతాలు కనిపిస్తాయి. స్థూలముగా వానినే ఇప్పుడు మనము కోస్తానువున్న సర్కారు జిల్లాలు, రాయలసీమ, తెలంగాణా అంటున్నాము. పరిపాలనకు సంబంధించినంతవరకు ఈ మూడు ప్రాంతాలు ఏకమైనా మనస్సుల కలయికకు ఇంకా కాలం తీసుకునేటట్లు రాష్ట్ర రాజకీయాలను, అందులోనూ ఇటీవల జరుగుతున్న సంఘటనలను చూస్తున్నవారికి అనిపిస్తున్నది.

భారతదేశమునకు ధాన్యాగారాలలో ఒకటైన ఆంధ్ర ప్రదేశ్ విస్తీర్ణము 106,041 చదరపు మైళ్ళు వుంది. జనాభా 31,260,133లు ఇందులో పురుషులు 15,742,912, స్త్రీలు 15,517,221 మంది వున్నారు. సగటు వర్షపాతము 35.65 అంగుళాలు. 20 జిల్లాలు, 188 తాలూకాలు 1000 రివిన్యూ మండలాలు, 298 పట్టణాలు 28,450 గ్రామాలు వున్నాయి. ఈ నెల 1 తేదీన హైదరాబాద్, సికింద్రాబాద్ నగరాల విలీనముతో రాజధాని నగరము హైదరాబాద్ జనాభా 15 లక్షల జనాభాతో దేశంలోని మహానగరాలలో అయిదవది అయింది.

ఆంధ్ర ప్రదేశ్ లో వ్యవసాయానికి అనుకూలమైన వాతావరణం, నేల ఉన్నవి. రెండు మహానదులు గోదావరి, కృష్ణ ప్రవహిస్తూ నీటి పారుదల సౌకర్యాలు అపరిమితముగా వున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు వ్యవసాయం అభివృద్ధికిగాను చిన్న, మధ్యరకము, పెద్ద ప్రాజెక్టులు అనేకము నిర్మిస్తున్నారు. కొత్త వానిగూర్చి ఆలోచిస్తున్నారు. వివిధ పైర్ల క్రింద 29,381,000 యకరాల భూమి వుంది. 42,42,655 బావులువున్నాయి. 1958-59 లో ఇరిగేషన్ క్రింద 68 లక్షల యకరాలు వున్నాయి. 61 లక్షల 56 వేల టన్నుల ఆహార ధాన్యాలు వుత్పత్తి అయ్యాయి.

91 కోట్ల రూపాయలు ఖర్చు అయ్యే బహుళ ప్రయోజనకారి అయిన నాగార్జున సాగర్ ప్రాజక్టు నిర్మాణం చురుకుగా సాగుతోంది. సంవత్సరానికి రు. 14 కోట్లు ఖర్చు పెట్టే తాహతుగల యంత్రాంగం ఏర్పడి పని జరుగుతోంది. 1955 లో ఈ ప్రాజక్టుకు ప్రారంభోత్సవం జరుపుతూ ప్రధాన మంత్రి నెహ్రూ దీనిని 'నవభారత్ లో నవీన దేవాలయం' అని అన్నారు. గత అక్టోబరులో మరల ఈ ప్రాజక్టును దర్శించినప్పుడు "ఇది మీరు వెలిగించినదీపం" అని ఒక వృద్ధ కార్మికుడు అనగా ప్రధాన మంత్రి దానిని అపూర్వమైన కితాబ్ గా భావించి ఇలాంటి దీపాలు అక్కడక్కడ వెలిగించగలిగితే తన జీవితము ధన్యమైనట్లు భావిస్తానని అన్నారు.

మరో రెండు ప్రాజక్టులు తొంపేరు, తుంగభద్ర ఎగువకాలవ నిర్మాణము, కృష్ణా బరాజ్ నిర్మాణం పూర్తి అయ్యాయి. 18 కోట్లు ఖర్చు అయ్యే తుంగభద్ర ఎగువకాలవ నిర్మాణం పని ప్రారంభమైంది. గోదావరినదిమీద పోచంపాడువద్ద 15 కోట్లతో నిర్మించదలచిన ప్రాజక్టునుగూర్చి దర్యాప్తు పూర్తి అయింది. కాని బొంబాయి ప్రభుత్వమువారి అభ్యంతరం, ప్రణాళికాసంఘంవారి సందేహాలవలన పని ప్రారంభంలో కొంత ఆలస్యం అవుతోంది. రాష్ట్రపబ్లిక్ వర్క్సుశాఖ మంత్రి ద్వితీయ ప్రణాళికలోనే ఈ ప్రాజక్టు పనిని ప్రారంభించాలని శాయశక్తుల కృషి చేస్తున్నారు. ఎగువసీలేరు, ప్రాజక్టు విషయంలో ఒరిస్సాతో ఒప్పందం కుదిరింది. వంశధార ప్రాజక్టును గొట్టదగ్గర నిర్మించటానికి ఒరిస్సా, ఆంధ్రప్రభుత్వాల మధ్య ఒప్పందం కుదిరినట్లు ఆగస్టు 8వ తేదీన లోక్ సభలో కేంద్ర ఇరిగేషన ఉపమంత్రి ప్రకటించారు. దీనితో ఈ అడ్డంకూడా తీరిపోయింది.

ఖనిజసంపదకు లోపం లేకపోయినా ఆంధ్రప్రదేశ్ అనేక కారణాలవలన వ్యవసాయరాష్ట్రంగానే వుండిపోయింది. పరిశ్రమలు ఏమీ అభివృద్ధకాలేదు. స్వరాష్ట్రం లేకపోవటం కేంద్రమునుండి తగినంత సహకారం లభించకపోవటం కొంతవరకు ఇందుకు కారణం అయి వుండవచ్చు.

వ్యవసాయము పరిశ్రమల అభివృద్ధికి అత్యవసరమైన విద్యుత్ వుత్పత్తి విషయంలో కూడా అశ్రద్ధ ఏమీ జరగటం లేదు. రాష్ట్రంలో ద్వితీయ ప్రణాళిక ప్రారంభంలో విద్యుత్ తలసరి వినియోగం 7 యూనిట్లు వుంది. ఇప్పుడది 12 యూనిట్లు అయింది. ద్వితీయప్రణాళికాంతమునకు 15 యూనిట్లు అవుతుంది. గ్రామాలకు విద్యుత్ సరఫరా 700 నుండి 1769 అయింది. ఒరిస్సాతో ఒప్పందం కుదిరినందున 1,20,000 కిలోవాట్ల విద్యుత్ వుత్పాదన శక్తివంతమైన ఎగువసీలేరు జలవిద్యుత్ పథక నిర్మాణమునకు ఆటంకం తీరిపోయింది. 2,28,000 కిలోవాట్ల విద్యుత్ ను వుత్పత్తిచేసే శ్రీశైలం ప్రాజక్టు దర్యాప్తు పూర్తి అయింది. తృతీయ ప్రణాళికక్రింద ఈ ప్రాజక్టు నిర్మాణం వచ్చే వేసవిలో ప్రారంభమవుతుందని మంత్రులు చెప్తున్నారు. నిరుటినుండి విద్యుత్ మండలి ఏర్పడి రాష్ట్రమునంతను ఒకే 'గ్రిడ్' క్రిందకు తీసుకొని వచ్చేపని జరుగుతోంది.

ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత దృష్టి పరిశ్రమలపై పడి మరి కొంత కృషి జరుగుతూవుంది. సింగరేణి కాలరీలలో బొగ్గు వుత్పత్తి 1956 నుండి నేటికి 17.46 లక్షల టన్నులనుండి 28 లక్షల టన్నులు దాటి త్వరలోనే 30 లక్షల టన్నులు కాబోతున్నది. రాజమండ్రి కాగితముమిల్లు, గూడూరు పింగాణీ ఫాక్టరీల అభివృద్ధి జరుగుతున్నవి. అనేక పారిశ్రామికనగరాల నిర్మాణం చురుకుగా సాగుతోంది. ఖద్దరు గ్రామీణ పరిశ్రమల అభివృద్ధికి బోర్డును ఏర్పాటుచేశారు. కొత్తగూడెంలో ఎరువుల ఫాక్టరీకి ఏర్పాట్లు జరుగుతున్నాయి. చేనేత అభివృద్ధికి ద్వితీయ ప్రణాళికలో 5 కోట్లు ఖర్చు అయినాయి. తృతీయ ప్రణాళికా కాలంలో 12 కోట్లు ఖర్చుకాగల ఒక పథకాన్ని తయారుచేశారు.

రవాణా సౌకర్యాల విషయంలో ఆంధ్రప్రదేశ్ లో 2902 మైళ్ళ రైలుమార్గము, 1409 మైళ్ళ జాతీయ రహదార్లు, 2072 మైళ్ళ రాష్ట్ర రహదార్లు, 2527 మైళ్ళ మేజరు జిల్లారోడ్లు, 8458 మైళ్ళ ఇతర రస్తాలు వున్నాయి. భద్రాచలం దగ్గర గోదావరిమీద 57 లక్షల ఖర్చుతో వంతెన నిర్మాణం జరు

(69 వ పేజీ చూడండి)



# తెలుగు వెలుగులు 47

అరవయ్యో సంవత్సరం లో అడుగుపెడుతున్నా, తల పండి కొండలాగా నెరిసిపోతున్నా పదహారు సంవత్సరాల బాలకుమారుడుగా కాకపోయినా ఇరవై అయిదేళ్ళ యువకుడి వలెభావం కలుగజేస్తాడు. అందుకు తగినట్లు మనిషి ముస్తాబు అవుతాడు.

శ్రీ మొసలికంటి తిరుమలరావు అనడం కంటె తిరుమలరాయడు అనో, తిరుమల ప్రభువు అనో పేరు పెట్టితే మనిషికి తగినట్టుగా ఉండేది. ఆయనకు రావు లక్షణాల కంటె రాయడు లక్షణాలే జాస్తి.

శ్రీ తిరుమలరావు ఏదో గ్రహపాటున గాంధి మాయలో పడ్డాడుగాని లేకపోతే ఓ ఛోటా పాదుషాలాగా అనవరతము చిన్న దర్బారు నడుపుతూ ఉండేవాడు. ఇప్పుడైనా కదిలితే కంచి పోతా మన్నట్లు నడుస్తాడు ఆయన.

మనిషిని చూస్తే కనుపించదుగాని శ్రీ తిరుమలరావు ప్రథమ గాంధీఉద్యమంనాటివాడు. కాలేజివిద్య అభ్యసిస్తూ దేశంకోసం చదువు వదిలివేసినాడు. సూక్ష్మబుద్ధితోపాటు చిన్నప్పటినుండీ ఆత్మవిశ్వాసం కూడా బాగా ఉన్నది. రెండవది రవంత ఎక్కువ కూడా ఏమో!

కాకినాడ కాంగ్రెసు అప్పుడే స్వదేశీ వస్తుప్రదర్శనకు కార్యదర్శిగా వ్యవహరించాడు ఆయన. తెలివితేటలుచూచి మహర్షి సాంబమూర్తి, డాక్టర్ పట్టాభిగారలు దగ్గరకుతీశారు. అందులో ముఖ్యంగా సాంబమూర్తిగారు చంకకెక్కించుకున్నారు. ఆయనను గారాబంచేస్యవనికూడా అంటారు. అందుకనే సహచరులవద్ద కొంత గారాబాన్ని ఒలికిస్తాడు.

శ్రీ తిరుమలరావు తరంవారిలో ఎవరూ ఆయన అలంకరించినన్ని పదవులు అలంకరించ లేదు. 1952 నుండి '57 వరకు తప్ప 1936 నుండి నేటివరకు ఆయన కేంద్ర శాసన సభ్యుడుగానో పార్లమెంటు సభ్యుడుగానో ఉంటున్నారు. కేంద్రంలో ప్రప్రథమంగా ఉపమంత్రి అయిన ఆంధ్రుడు. వింధ్యప్రదేశ్‌కు ఉప (లెఫ్టినెంట్) గవర్నరు అయినాడు. రెండు పదవులను దర్జాతో నిర్వహించాడు. విశ్వరాజ్య సమితికి ప్రతినిధిగా వెళ్ళాడు. పార్లమెంటరీ డెలిగేషన్‌తో విదేశాలు పర్యటించాడు. ఒకదఫా తప్ప ఇన్ని సంవత్సరాలూ తీయకుండా అఖిలభారత కాంగ్రెసు సంఘ సభ్యుడుగా ఉన్నాడు.

శ్రీ తిరుమలరావుకు ఇంతకాలమూ ఢిల్లీ వైపే చూపు. అది ఇంతవరకు రాష్ట్ర రాజకీయాలవైపు మళ్ళలేదు. దానికి ఆయన మనఃప్రవృత్తి కొంత కారణం కావచ్చు. కాని వేరు కారణంకూడా లేకపోలేదు. తూర్పుగోదావరిజిల్లాలో కళా వెంకటరావు, పళ్ళంరాజు (అదివరకటిదాకా సాంబమూర్తిగారూ) ఉండగా తనకుకూడా స్థానం ఎక్కడ ఉంటుందని ఢిల్లీకి దారితీశాడు.

శ్రీ వెంకటరావు అస్తమించాడు కాబట్టి '62 ఎన్నికలలో రాష్ట్ర శాసన సభలో ప్రవేశించడానికి ప్రయత్నిస్తారేమో! అయితే రాష్ట్ర రాజకీయాలు అప్పటికి ఎలా మారుతాయో తెలియదు. ఆయన ప్రకృతి కూడా ఆయనకు అడ్డు రావచ్చు. ఏదీ పోరాటపడి సాధించుకోలేడు. బద్ధక ప్రభువు. రోగి అయినా భోగి కూడాను. ఒకరి భుజాల మీద కూర్చుని అందలం ఎక్కాలంటాడు. తనకు తానై నిచ్చెన ఎక్కడు. కాకపోతే తిరుపతి నుండి తిరువణ్ణామలైకు, అక్కడనుండి ఢిల్లీకి యాత్ర చేస్తూ ప్రదక్షిణ నమస్కారాలు చేస్తూ ఉంటాడు.

శ్రీ తిరుమలరావు మంచి వాదనాపటిమ కలవాడు. తెలుగులోను ఇంగ్లీషులోనూ బాగా మాట్లాడ గలడు. మంచి ప్రతిసమాధాన శక్తి గలవాడు. సరదా పురుషుడు. కబుర్లతో ఎంత సేపైనా కాలక్షేపం చేయ గలడు. అయితే అప్పుడప్పుడు తగవు కొని తెచ్చుకుంటాడు.

పెట్టుపోతలు మహా ఇష్టమైన మృష్టాన్న ప్రియుడు. ఆయన అతిథి సత్కారాలు వైష్ణవ దేవాలయంలో ప్రసాదాలు, మధ్వుల ఇంటి భోజనాలు. 

# బావా-మరదళ్లు

బస్సు కదిలింది...

ఒకరిమీద మరొకరు గూడ్సు బండిలోని సామాన్లవలె మనుష్యులు క్రిక్కిరిసిపోయారు.

కాళ్లు నలుగుతున్నై -

వేళ్లు విరుగుతున్నై -

సలాభావం కారణంగా తనను కౌగలించుకున్నట్టు నిలుచున్న ఆ అమ్మాయిని తేరిపార చూచిన అబ్బాయి, చామనచాయలో నిగనిగలాడుతోన్న ఆమె కా చామంతి రంగు చీర "బలే నూటయిందని" తనకు తాను చెప్పుకున్నాడు.

ఏ క్షణంలో తనను గుండెలకు హత్తుకుంటాడో నన్నంత సామీప్యంలో నిలుచున్న ఆ అబ్బాయిని అరకంట చూసిన అమ్మాయి, కళాకారునిలా కనిపిస్తోన్న అతనికా ఖద్దరు సిల్కు లాల్చీ "బ్రహ్మాండంగా" ఉందని మనస్సుతో చెప్పుకుంది.

అంతలోనే కండక్టరుస్పుత్నిక్కు "ప్లీజ్ ప్లీజ్" మంటూ బస్సు పైభాగంలోని రాడ్ రాకెట్టు సహాయంతో గాలిలో తేలిపోతూ మానవ ఉల్కల్ని తప్పించుకుని, బస్సుచివరి కోడసీ కుహరంలోకి చేరుకోసాగింది.

కండక్టరు స్పుత్నిక్కు తమకు సమీపంగా సాగుతూ ఉన్నప్పుడు తప్పనిసరైనందువల్ల ఆ అబ్బాయి అమ్మాయి లిరువురూ ఇంకొస్త దగ్గరగా జరిగి ఆకాస్సేపటికొరకు విధిగా ఒకరినొకరు కౌగలించుకోక తప్పలేదు.

గాలి జోరుగ వీచింది.

ఉన్నట్టుండి గాలి తాకిడికి ఆ అమ్మాయి పమిట కొంగు రివ్వున లేచి అబ్బాయి మొహాన్ని కప్పేసింది.

అబ్బాయి నఖశిఖాగ్రం పొంగిపోయాడు!

"...సా...రీ..."

ఆంగ్లంలో క్షమాపణ చెప్పుకుంది అమ్మాయి.

"నో. మెన్షన్..."

ఆంగ్లంలోనే క్షమించాడు అబ్బాయి.

అమ్మాయి తన పమిటకొంగుతోపాటు అబ్బాయి హృదయాన్ని కూడా లాక్కుని తనివితీరా గుండెలకు హత్తుకుంది.

అమ్మాయి నదివోలె ఉప్పొంగిపోయింది!

తలెత్తి అబ్బాయికేసి దృష్టి సారించింది.

కళ్ళు నులుముకుంటున్నాడు అబ్బాయి.

"కంట్లో గుచ్చుకోలేదు గదా?" కస్తుదల ప్రశ్నించింది అమ్మాయి అనునయంగా.

"కంట్లో గాదు... హృదయంలో గుచ్చుకుందన్నట్టు ... తీయని బాధ నటించాడు అబ్బాయి, అవ్యక్తంగా.

మెళ్లో మంగళసూత్రంలాంటి జాడ కనిపించనందువల్ల ఆమెకు పెళ్ళి కాలేదనుకున్నాడా అబ్బాయి.

వేలికి ఉంగరం, చేతికి వాచీ యిత్యాదులేవీ లేనందువల్ల అతను అవివాహితుడేనని తేల్చుకుందా అమ్మాయి.

యూనివర్శిటీ వచ్చింది. బస్సు ఆగింది.

అబ్బాయి దిగాడు. అమ్మాయీ దిగింది.

ఫర్లాంగుదూరంలోవున్న ఆర్ట్సుకళాశాల సింహద్వారం వచ్చింది.

సింహద్వారంలో చూపులు కలుసుకున్నై - చిర్నగవులు పలకరించుకొన్నై.

చామనచాయలో నిగనిగలాడుతోన్న ఆమె కా చామంతిరంగుచీర "బలేనూటయిందని" మరొక్కమారు తనకుతాను చెప్పుకుని మేడమీది పైభాగంలో తనతరగతులు జరిగే చోటికి చేరుకున్నాడా అబ్బాయి.

**కంచర్ల శ్రీ**

కళాకారునిలా కనిపిస్తోన్న అతని ఖద్దరు సిల్కులాల్చీ "బ్రహ్మాండంగా వుందని" మరొక్కపర్యాయం మనస్సుతో చెప్పుకుని ఆమూల సౌధంబులోని లేడీస్ రూంలోకి జారుకుందా అమ్మాయి.

ఇంటర్వెల్ మ్రోగింది...

రీడింగురూం నిండింది.

అబ్బాయివచ్చి తెలుగు సెక్షనువద్ద ఓకుర్చీ తను ఆక్రమించుకున్నదేగాక, ప్రక్క కుర్చీలో తన ఫైలుంచి 'పత్రిక'కోసం కళ్ళతో గాలించాడు. అది ఎదురుగా కూచున్న ఓ ప్రబుద్ధుని చేతిలో కనిపించింది. అప్పుడికవిధిలేక చేతికందిన పత్రికేదో తీసుకుని పుటలుమాత్రం గబగబా తిరగేయసాగాడు.

ఇంతలో ఆ అమ్మాయి వచ్చింది.

తెలుగుసెక్షనువద్దకు విచ్చేసింది.

నలువేపులా పరికాయించి చూచిన ఆ అమ్మాయికి ఒకే ఒక కుర్చీ ఖాళీగా కనిపించింది. కాని దాన్లో ప్రక్క కుర్చీలోని అబ్బాయి తాలూకు ఫైలు నిద్రపోతోంది గభీరంగా!

ఆ అమ్మాయి తిన్నగా ఫైలు నిద్రపోతోన్న ఆ కుర్చీ సమీపించి, కళ్లుచిట్లించి ముఖంలో చిరుకోపం ప్రదర్శించి గొంతులో తీక్ష్ణభావం తొణికింపచేస్తూ "మిస్టర్" అంది ముక్తసరిగా—ప్రక్క కుర్చీలో కూచున్న ఆ మిస్టర్ ఎవరయిందీ గమనించకుండా.

ఎదురుగా కూచున్న ప్రబుద్ధుడెప్పుడు 'పత్రిక'ను బల్లమీద గిరవాటేస్తాడోనని పొంచికూచున్న ఆ మిస్టర్ "సారీ!" అంటూ ప్రక్కకుర్చీలో నిద్రపోతోన్న తనఫైలందుకుని కుర్చీ ఖాళీ చేశాడు—తన్ను పలకరించినది ఎవరయిందీ చూడకుండా.

అబ్బాయి ఫైలందుకోగానే అమ్మాయి కాయంచలా ఆసనం అలంకరించింది.

"మలయానిలం వీచింది...

చామంతిరంగుచీర చలించింది.

ఖద్దరు సిల్కులాల్చీ కదలాడింది.

"అరే!- ఆ అమ్మాయే?" అనుకున్నాడు అబ్బాయి.

"ఓహో!- ఆ అబ్బాయే?" అనుకుంది అమ్మాయి.

ఈలోగా ఎదురుగా కూచున్న ప్రబుద్ధుడు "పత్రిక'ను బల్లమీద గిరవాటేసి తన దారిని చక్కాపోయాడు.

పత్రికను అబ్బాయి అందుకున్నాడు.

అదేక్షణంలో అమ్మాయీ అందుకుంది.

ఓ అరక్షణం ఇరువురూ సమబలంతో దాన్ని తమవేపు లాక్కుని, మరో అరక్షణంలో ఒకేపర్యాయం బల్లమీద వదిలేసి, యింకో అరక్షణం పరస్పరం చిరుకోపంగానూ, చిరు సంతోషంగానూ చూపులు మార్చుకున్నారు.

ఎవరో ఓ అమ్మాయి యికిలించింది.

మరో అబ్బాయి సకిలించాడు.

"పత్రికను మీరు తీసికోండి!..." స్వార్థత్యాగాన్ని ఒలకబోశాడా అబ్బాయి.

"నో-నో- మీరు చదువుకోండి!..." మొహమాటాన్ని చిలకరించిందా అమ్మాయి.

బల్లమీదున్న పత్రికనుతీసి అబ్బాయి కందించింది. బస్సులో వస్తూవున్నప్పుడు పమిటకొంగుతోపాటు హృదయాన్ని లాక్కున్నందుకు ప్రతీకారంగా అందిస్తోన్న పత్రికతోపాటు ఆ అమ్మాయి ఆత్మనూ లాక్కున్నాడు అబ్బాయి.

తన ఆత్మను ఆ అబ్బాయికి అంకితంచేసి ఎటో నిష్క్రమించిందా అమ్మాయి. ఆ అమ్మాయి కనిపించేంతవరకూ చూపులతూపులతో వెంటాడి ఆ తర్వాత నిశ్వసించాడా అబ్బాయి.

నాలుగైంది...

ఎలక్ట్రిక్ బెల్లు మ్రోగింది.

తెలుగు లెక్చరర్ ఆలిండియా రేడియోలా వాగుతుండగానే అబ్బాయి తనముందు తెరచివుంచిన లావాటి గ్రంథరాజాన్ని 'ఠక్' మని మూసేశాడు.

అబ్బ—ఈయనింకా వాగుతున్నాడేం?




ఆ అమ్మాయి వెళ్ళిపోతుందేమో—!

అబ్బాయి మనో సంద్రంలో ఆలోచనా తరంగాలు. ఆవేదనా తురంగాలు.........

ఇందాక ఎలక్ట్రిక్ బెల్లు మ్రోగినప్పుడు అరగంటనగా క్రింద ఆ అబ్బాయికోసం చకోరంలా ఎదురు తెన్నులు కాస్తోన్న అమ్మాయి నరనరాలలో ఎలక్ట్రిసిటీ ప్రవహించినట్టయింది!

హమ్మయ్య...గంటైందిబాబు!
దిగుతాడులే ఆ నవాబు...!

అమ్మాయి భావోద్యానంలో తలపు పూవులు-తలపు తావులు.........

గంటైంతదుపరి ఆ అమ్మాయి వెళ్ళిపోక ముందే తా వెళ్ళి పట్టుకోవాలనుకున్నాడు అబ్బాయి. పట్టుకుని ప్రణయభిక్ష పెట్టమని ప్రార్థిద్దామనుకున్నాడు. అనుకుని వళ్ళంతా కళ్లు చేసుకుని కిటికీలోంచి క్రిందకు చూశాడు; ఆ అమ్మాయిగాని కనిపిస్తుందేమో నని.

గంటైంది గనుక ఆ అబ్బాయి ఇక ఎటూ దిగుతాడు లెమ్మనుకుంది అమ్మాయి. రెక్కలు గట్టుకుని మరీ తన ముందువాల్తాడనుకుంది. వాలి తను త్వరగా రా(లే)నందుకు క్షమాపణ చెప్పుకుంటాడనుకుంది. అనుకుని కళ్లు యింతలింతలు చేసుకుని తంతెలకేసి చూసింది; ఆ అబ్బాయిగాని దిగుతున్నాడేమో నని.

ఇరవయ్యైదు సెకనులు గడించి పై... ఐనా ఆ అబ్బాయి అచూకీ లేదు.

అమ్మాయి ఆగ్రహావేశురాలైంది.

‘ఛీరా!’ అనుకుంది.

తనకోసం ముందుగాక పోయినా, కనీసం గంటైన తదుపరయినా రానందుకు అబ్బాయి మీద ఆగ్రహం అరవై పాళ్లు, ఈర్ష్య యిరవై పాళ్లు, విసుగు వింకతిపాళ్లు జనించినై. కసి కొద్దీ పళ్లు పటపట లాడిస్తూ ‘మగాళ్లంతా యింతే సుమా’ అనుకుంది. అదను కనిపెట్టి అగ్ని మీద ఆజ్యంపోసినట్టు మనస్సనే గ్రామఫోనుమీద ఆరాటమనే రికార్డు “రాదే చెలీ- నమ్మరాదే చెలీ - మగవారినిలా నమ్మరాదే చెలీ!” పాట వినిపించింది.

గంటై యిరవయ్యైదు సెకనులు గడిచినా తనధోరణి మానుకోని లెక్చరరు మీద అబ్బాయికి మం...డు కొచ్చింది. ఏమయితే అయిందని ఉపన్యాస మధ్యంలోనే చెప్పాకుండా చెయ్యకుండా గబుక్కున లేచిపోదామని లోలోన దృఢంగా నిశ్చయించుకున్నాడు. కాని తీరా ధైర్యంచేసి లేవబోయే సరికి, “సమాజం - సభ్యత - సంస్కృతి - సంప్రదాయం” యిత్యాది సకారాది పదాలన్నీ గుడ్రచేసి “గట్టిగా కూచోవోయ్!” అంటూ గద్దించినై!

ప్రణయఘట్టం వచ్చిందంటే చాలు! శృంగారరసాన్ని గూర్చి కంఠశోషగా గంటల తరబడి ఉపన్యసిస్తారు మరీ వళ్లు మర్చిపోయి. తెలుగు లెక్చరర్లందరికీ యిదో తెగులు— కర్తవ్యతా విమూఢుడయిన అబ్బాయి కసి కొద్దీ లెక్చరరుకు వినిపించేంత పెద్దగా గొణిగాడు.

లెక్చరరు కరుణించాడు...

అబ్బాయి మనస్సుతోపాటు శరీరమూ ఎగిరి గంతేసి బాల్కనీలో వాలి, కన్నుతో నలెసల పరకాయించి చూచి, క్రిందనుంచి పోయే అంత మంది సీతాకోక చిలుకల్లోంచి ఆ చామంతి రంగు చీర అమ్మాయిని యిట్టే పోల్చుకోగలిగింది.

అబ్బాయి రాలేదన్న ఆవేశంలో విద్యుల్లతలా ముందుకు దూసుకుపోయిన అమ్మాయికి, పైన బాల్కనీలో ఖద్దరు సిల్కు లాల్చీ కనిపించటంతో కాళ్ళకు ‘సడన్ బ్రేకు’ పడ్డట్టయింది. ఆరాటంతో అట్టుడికి పోయిన ఆత్మ అంతలోనే ‘జిల్’ యిపోయింది.

తంతెలం దిగివస్తే వరకూ అయ్యో అల

త్యాన్ని భరించలేని మనస్సు అక్కడినుండి అపాటున క్రింద నిలుచున్న ఆ అమ్మాయి పాద పద్మాలమీద దూకమంది. శరీరాని కయితే దూకాలనే వుంది గానీ, చూస్తూ చూస్తూ అంత ఎత్తు మీంచి ఎలా దూకడమూ అని యిక్కించిత్తు సందేహించింది. అట్టే అలస్యాన్ని భరించలేని మనస్సు "యిక

# బావా-మరదళ్లు

నీ యిష్ట"మంటూ శరీరంతో చెప్పి, తను ఇట్టే క్రిందకు దూకేసి దూకింది. గత్యంతరం లేక శరీరం శర వేగంగా తంతెలకేసి పరుగు లంకించుకుంది.

ఇందాకట్నుంచీ ఆ అబ్బాయి కోసం కాచుకూర్చున్నట్టు అతనికి తెలిసిపోతే, తను లోకువయిపోదూ!—అందుకని అబ్బాయి కనిపించి నప్పటినుంచీ నడువను పోపొమ్మని సత్యాగ్రహం చేస్తూ వున్న కాళ్ల గడ్డాం పట్టుకు బ్రతిమిలాడుకుని ముందుకు గమించింది అమ్మాయి.

అబ్బాయి అమ్మాయిని వెంటాడాడు...

హిమాలయ శిఖరాగ్రం నుంచి ప్రళయ కాల రుద్రునివలె మహా ప్రళయంగా దూకుతోన్న జలరాశిలా మేడ తంతెలమీంచి మనోవేగంతో దూసుకువస్తోన్న అబ్బాయి, శివ జటాజూటంలో సేదదీరి రాయంచవోలె మందమందంగా మైదానాల్లో సాగే గంగా భవానిలా వరాండాలో నడయాడుతోన్న అమ్మాయిని సింహద్వారం చేరుకునేలోగా అందుకోగలిగాడు.

అమ్మాయి ఒక్కసారి అభిసారికై పోయింది. కాని అభిమానం అపర సత్యభామై లేచింది.

గంటైం తదుపరి యిరవయ్యాయిదు సెకనులు తనను విరహానలంలో అట్టుడికిపోయేట్టు చేసినందుకు ప్రతీకారంగా కన్బొమల విల్లులో అలకల అమ్ములు సంధించి తనను గాయపరచబోయిన అమ్మాయిని, జరిగిన ఆలస్యానికి క్షమించాల్సిందన్నట్టు అధరాంజలిలోని హాస పుష్ప సమర్పణతో సమాధాన పరచాడు అబ్బాయి.

అబ్బాయి ఆనందం గట్టు తెంచుకుంది.

అమ్మాయి ఆననం బిట్టు వంచుకుంది.

మదిలో మెదిలే భావాలకు భాషారూప మిచ్చి, ఆమెపట్ల తనకు కలిగిన అపార ప్రేమానుభూతులను వ్యక్తం చేయాలను కున్నాడు అబ్బాయి. ఎదలో కదిలే ఊహలకు సాహితీరూపమిచ్చి ఆయనపట్ల తనకు కలిగిన అవ్యాజానురాగాలను గానం చేయాలనుకుంది అమ్మాయి.

కాని—వలపు తలపులు తెలుపుతోన్న "తీయని బాధ" వచ్చి వెలక్కొక్కరై యిరువురి గొంతులకూ అడ్డుపడింది.

ఆ ఆనందోత్సాహంలో అబ్బాయి కాళ్ళకు రెక్కలు, అమ్మాయి కాళ్ళకు రెక్కలు మొలిచాయి. అరసెకను సమయం గడవకుండానే ఫర్లాంగుదూరంలో వున్న బస్సు స్టాపును యిరువురూ చేరుకోవటం—సమయానికి బస్సు రావటం లిప్తకాలంలో జరిగిపోయింది.

బస్సు ముందుకు సాగింది......

ఆ యూనివర్సిటీ విద్యార్థినీ విద్యార్థు లిరువురూ వికాసవాసీనులయ్యారా బస్సులో.

తనప్రక్కనే కూచుని, తనకేసి తదేకంగా చూస్తూన్న ఆ అబ్బాయిని తానింతకు ముందెక్కడో చూసినట్టు స్ఫురణకు

(68-వ పేజీచూడండి)










పత్రికలు స్వాధీనపరుచుకోవాలని
సింహళ ప్రభుత్వం సంకల్పించింది....
సింహళ పత్రికలు
ప్రభుత్వం చెప్పిందే పలుకు
శాంతి దూత
అణ్వాస్త్ర రహిత మండలం
ఏర్పాటు చేయాలని చైనా ప్రధాని ప్రతిపాదించారు.
ఒంటొంటిని మింగేస్తే
పీడ పోను!
భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ వాద వర్గం
భారత కమ్యూనిస్టు పార్టీ పెకింగ్ భక్తుల వర్గం

# బెన్-హార్

## జరిగిన కథ

క్రీస్తు ఉద్భవించిన తరువాత రెండు దశాబ్దాలకు...రోమన్ సామ్రాజ్యంలో చేరిన జెరూసలెములో అంటోనియా దుర్గం సైన్యాధిపతి పదవి స్వీకరించాడు మెస్సాలా. బాల్య మిత్రుడు యూదు రాకుమారుడు అయిన బెన్-హార్ అతనిని కలుసుకొన్నాడు. యూదా ప్రజలను అణచి ఉంచడంలో అతని సహాయం అర్థించాడు మెస్సాలా. నిరాకరిస్తూ స్వాతంత్ర్యం దత్తం చేయమని కోరినాడు బెన్-హార్.

క్రోధంతో మెస్సాలా కనుబొమలు ముడి పడినవి. బెన్-హార్ [illegible] కూర్చుని ఉన్నవాడు లేచాడు.

"నవ్వులాటకు అన్నావా, యూదా, ఈ మాటలలో పరిహాసాస్పదమైన వినయం కాదే, ఇది?

"బాల్య స్నేహితుడవు. నాకున్న ఒకే గొప్ప మిత్రుడవు. కనుకనే నాకు అవసరమైన సహాయం నీవల్ల లభ్యం అవుతుందని నమ్ముకొన్నాను.

"వివేకం చూపు. ఈనాడు ప్రపంచం అంతా రోమనుల ఆధిపత్యం క్రింద ఉన్నది. మా అధికారానికి తిరుగులేదు. ఈ ప్రాంతంలో తలెత్తే ఏ చిన్న విప్లవభావాలను అణచివేసి తీరాలి" అన్నాడు మెస్సాలా.

అతనికి ఆవేశం వచ్చింది. ఉన్నపళంగా బెన్-హార్ వంక తిరిగాడు. తర్జనితో తనను నిర్దేశిస్తూ గొంతెత్తి మాట్లాడ సాగాడు.

"క్రొత్త గవర్నరు వలేరియస్ గ్రాటస్. [illegible] తరువాత అధికారం చేపట్టి. గ్రాటస్ మరి రెండు లీజియన్ల సేనతో ఇక్కడికి వస్తున్నారు. ఈ ప్రాంతం ప్రజలను అణచి ఉంచడానికి ఇది వరకు ఎప్పుడూ అంత సేనను పంపలేదు.

"ఈ ప్రాంతంలో శాంతి నెలకొల్పాలని, ధిక్కారమనేది మచ్చుకైనా లేకుండా చేయాలని దైవసముడైన చక్రవర్తి స్వయంగా ఆజ్ఞాపించారు. చక్రవర్తి గవర్నరును వేయి కళ్ళతో కనిపెట్టి చూస్తున్నారు నన్ను కూడా కనిపెట్టి చూస్తున్నారు! యూదా, మూర్ఖంగా మాట్లాడకు. పరమపవిత్రమైన ఈ బాధ్యతా నిర్వహణంలో నేను మహాశక్తివంతంగా ప్రవర్తించక తప్పదు. నేను చెప్పినట్లు నడుచుకుంటానని మాట ఇవ్వు..."

మెస్సాలా మాటలకు అడ్డుతగిలాడు బెన్-హార్. లేచి మెస్సాలాకు అభిముఖుడై నిలిచి రెట్టించిన గాంభీర్యంతో మాట్లాడసాగాడు. "నువ్వు చెప్పినట్లే విని, నా ప్రజలను కొరడాలతో కొట్టి హింసించడానికి, అతి క్రూరంగా వధించడానికి నీకు తోడ్పడాలా? నావారికి నేను చేటుగా అంతటి ద్రోహం చేయగలననే అనుకొన్నావా, మెస్సాలా? నామీద నీకు ఎంతటి నికృష్టమైన అభిప్రాయం ఉందో ఇప్పుడు అర్థం చేసుకొంటున్నాను.

"స్నేహితుడవనుకొన్నాను. మనసారా ప్రేమించాను. నీ రాకకోసం నిరీక్షించాను. కాని, మెస్సాలా, నీవు పూర్తిగా మారిపోయావు మిత్రుడుగా వెళ్ళినవాడవు శత్రువుగా తిరిగి వచ్చావు..."



మెస్సాలాగా స్టీవెన్ బోయిడ్

మెస్సాలా కోపం మిన్నుముట్టినది. గర్జించాడు. "నీవు-నీవే మారిపోయావు ఏనాడో! భగ్నమైన కల లేక కలలనే ఇంకా నమ్ముకొని కాలం గడిపే ఈ అలగా జనంలో నీవు కూడా ఒకడివా, బెన్-హార్? సాలమన్ ఘనత గతంలోని మాట! ఆ ఘనత మళ్ళీ తిరిగి వస్తుందనే భావిస్తున్నావా, పిచ్చివాడా? మీ మోజెస్ ప్రభుడు! మిమ్మల్ని ఉద్ధరించడానికి జాషువా మరల ఉద్భవించబోడు! డేవిడ్‌ను నమ్ముకొనినా కూడా ప్రయోజనం లేదు!"

బెన్-హార్ చలించలేదు. గాంభీర్యం ఉట్టిపడేటట్లుగా మాట్లాడాడు. "ఏమైనా నా దేవునిమీద నా ప్రజలపట్ల, నాకు అచంచలమైన విశ్వాసం ఉన్నది. నువ్వు నా ప్రజలను నిర్దాక్షిణ్యంగా కాలరాచవచ్చు. నా దేశాన్ని నాశనపరచుకోవచ్చు. కాని దానితో కథ అంతం కాదు."



ఆ వేగంతో ప్రక్కకు తిరిగి గుమ్మందగ్గరికి వెళ్ళుతూ ప్రశాంతమైన స్వరంతో తిరిగి అన్నాడు బెన్-హర్:

"దానితో కథ అంతంకాదు. ఎంతటి దౌర్జన్యానికి గురిఅయినా, ఏలాంటి విపత్తు సంభవించినా, ఏమైనాసరే, నా ప్రజలు తిరిగి తల ఎత్తుతారు, పోరాడగలరు..."

## సైమానడీజ్ హితవు

అది జూడా బెన్-హర్ భవనప్రాంగణం. చల్లని పిల్లతెమ్మెరలు వీస్తూఉన్న సమయంలో 'ఫౌంటెన్'వద్ద నిలిచిఉన్న బెన్-హర్ దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు.

బెన్-హర్ సేవకుడు, స్నేహితుడు, సంరక్షకుడు అయిన సైమానడీజ్ హితవు చెప్పాడు. అతడు మాట్లాడినతీరులో అతని అలజడి ప్రస్ఫుటంగా ధ్వనిస్తున్నది. "స్వామీ, మీరు జాగ్రత్తగా ఉండడం అవసరం నేను ఇప్పుడు అంటియోక్ వెళ్ళుతున్నాను. సమయం మించిపోతున్నది. అయినా వెళ్ళేముందు సవినయంగా మీకొక విజ్ఞప్తి చేయకతప్పదు. మెస్సాలాతో ఏర్పడిన ఈ తగాదా పరిష్కరించుకోండి. అతడు గర్విష్ఠి. అతనికి రోమన్ చక్రవర్తి అండ ఉన్నది. రోషంచూపినందుకు విచారం తెలియబుచ్చుతూ ఆయనకు ఒక లేఖ పంపండి. చిన్నతనంలో మీరు ఇద్దరూ ప్రాణస్నేహితులుకదా, తప్పులేదే" అన్నాడు సైమానడీజ్.

"చిన్ననాడు మేము మిత్రులం ఇప్పుడు కాదు!" బెన్-హర్ గొంతులో రోషం విచారం కరడుగట్టినవి. "మెస్సాలా మారిపోయినాడు. మనలను అణచిఉంచి మనపై అధికారం నెరపుతున్న రోమన్ సేనకు అధిపతిగా తిరిగివచ్చినప్పటినుంచి అతడు రోమన్ చక్రవర్తిని అధినేతగా మాత్రమే కాదు, సాక్షాత్తూ భగవంతుడుగానే పరిగణిస్తున్నాడు!"

అంతలో సైమానడీజ్ కుమార్తె ఎస్తర్ అక్కడికి రాగా బెన్-హర్ మాట్లాడడం విరమించాడు.

* * *

ఇక్కడ సైమానడీజ్ చరిత్ర, యజమానితో అతనికి ఉన్న సంబంధం వివరించడం అవసరం.

ఎస్తర్ తల్లి బానిస. పుట్టుకతో సంక్రమించినదా బానిసత్వం. ఆమెను ప్రేమించాడు సైమానడీజ్. ఉభయులు ఆకాలంలో బెన్-హర్ తండ్రి సేవకులే. ఎస్తర్ తల్లికి స్వాతంత్ర్యం దత్తం చేయడానికి అంగీకరించాడు ఆ ఉదారహృదయుడు.

ఉత్తముడైన యజమాని సేవనే స్వాతంత్ర్యం కన్న అధికంగా పరిగణించిన దామె. ఆమె సాంగత్యం అభిలషించిన సైమానడీజ్ స్వాతంత్ర్యాన్నే త్యజించి వంశపారంపర్యమైన బానిసత్వాన్ని కోరుకొని వరించాడు. ఆ ప్రేమజీవుల నోములపంట ఎస్తర్. కుమార్తె



ఎస్తర్‌గా హాయా హరత్

పుట్టిన కొలదికాలానికే ఇహలోకం విడిచినదా తల్లి.

యజమాని నిర్యాణానంతరం బెన్-హర్ వ్యవహారాలు అన్నీ చక్కబెట్టుతూ అతనిని విడువకుండా ఉన్నాడు సైమానడీజ్.

సైమానడీజ్‌కు, ఎస్తర్‌కు కూడా స్వాతంత్ర్యం ప్రసాదించిఉన్నాడు బెన్-హర్. ఎస్తర్ తన హృదయాన్ని వశపరచుకున్నదనీ గుర్తించాడు.

* * *

సైమానడీజ్ వందనంచేసి యజమానివద్ద సెలవుతీసుకొని ప్రయాణానికి ఉద్యుక్తుడైనాడు.

కుమార్తె వంకకు తిరిగి "ఆలస్యం చేయకు అమ్మా, రోమన్ సైనికులు రహదారులు అన్నీ మూసివేయకముందే మనం నగరం విడిచి పోవలసి ఉన్నది. కనుక త్వరగారా" అని హెచ్చరించి సైమానడీజ్ అక్కడినుంచి వెళ్ళాడు.

ఏకాంతం ఏర్పడగానే ఆమెను దగ్గరికి తీసుకొన్నాడు బెన్-హర్. ఎస్తర్ అతని భుజాలపై చేతులువేసి తొందరగా మాట్లాడసాగింది. "స్వామీ, మీరు జాగ్రత్తగా ఉండాలి. ఈ ఆపదలోంచి బయటపడి ప్రాణం కాపాడుకోవాలి. ఇక్కడే మీతో పాటే ఉంటే నాకు సుఖశాంతి ఉండేది. కాని ఏమిచేసేను? నాతండ్రి వృద్ధుడు. ఆయనకు ఆసరా అవసరం నాతండ్రిని కనిపెట్టుకొని ఉండడం నావిధి.

"ఏమైనా మిమ్మల్ని విడిచి వెళ్ళబోయేముందు నా కొక వాగ్దానం చేయమని కోరుతున్నాను. ట్రిబ్యూన్‌తో వచ్చిన ఈ తగాదా పరిష్కరించుకొని ఆయనతో సమాధానపడతానని మాట ఇవ్వండి."

"అందుకోసం చేయగలిగినదంతా చేస్తానని వాగ్దానం చేస్తున్నాను—కాని నా ప్రజలకు మాత్రం నేను ద్రోహం చేయలేను" అని బెన్-హర్ ముందుకు వంగి ఆమెను ముద్దుపెట్టుకొన్నాడు.

"వెళ్లు ఇంక. కొత్త గవర్నరు తన పరి



ఏకాంతం ఏర్పడగానే ఎస్తర్‌ను దగ్గరికి తీసుకొన్నాడు బెన్ - హర్

# బెన్ - హర్

కారంతో నగరంలో అడుగుపెట్టడానికి ముందుగానే మీరు నగరం విడిచి వెళ్ళాలి" అంటూ ఆమెను సింహద్వారం వరకు సాగనంపాడు బెన్-హర్. అక్కడ సైమానడీస్ విహారం ప్రయాణానికి ఆయత్తమై ఎస్తర్ రాకకోరకు నిరీక్షిస్తూ ఉన్నది.

ఉభయులవద్ద కడసారి సెలవు తీసుకొని పాలోచనగా తిరిగి భవనంలో ప్రవేశించాడు.

అతని తల్లి మిరియమ్ గుమ్మంలో ఎదురయింది.

"జూడా, కొత్త గవర్నరు మన వీధిలో నుంచి వెళ్ళేటప్పుడు 'బాల్కనీ'లో నిలిచి ఉండడం కనిపిస్తావుకదూ! మనం బాహాటంగా తిరుగుబాటు చేస్తున్నామని ఇతరులు అనుమానించడానికి ఆస్కారం ఇవ్వరాదు సుమా!" ఆమె ఆందోళనతో ప్రశ్నించినది.

తల్లికి ధైర్యం చెబుతూ తల ఊపాడు బెన్-హర్. "ఇప్పుడే బాల్కనీమీదికి వెళ్ళుతున్నాను—అయితే అమ్మా, మేము ఇద్దరం కలుసుకొన్న తరువాత మెస్సాలా మనఇంటికి వచ్చాడని, తిర్జాకు కానుక సమర్పించాడని విన్నాను. నిజమేనా?"

"అవును. నిజమే. కాని, మీ ఇద్దరికి మధ్య నడిచిన గొడవగురించి తెలుసుకొన్న తరువాత ఈసంగతి నీతో చెప్పడం మాకు ఇష్టంలేకపోయింది. మెసాలా వచ్చాడు. అద్భుతమైన బ్రూచ్ ఒకటి తిర్జాకు బహుమతిగా ఇచ్చాడు. పాపం తిర్జా మెస్సాలాను చూడగానే మొదట ఆనందంతో పొంగిపోయింది. పిచ్చిపిల్ల. చిన్నప్పటినుంచి మెస్సాలా మీద మనసు పెట్టుకొని ఉంది.

"మెస్సాలా మన ఇంటికి రాకపోతే ఎంతో బాగా ఉండేదని నాకు అనిపించినది చాలామర్యాదగా మాట్లాడాడు. మన్నన చేశాడు. కాని ఆ మనిషికి హృదయంలేదేమో అనిపించింది.

"అతడు మనిషేనా! అతనికి మనలాగే ప్రేమ అని ద్వేషం అని ఏమైనా ఉంటుందా! అతనిర్లక్ష్యంగా ఎవరో ఎవరితోనో అయినట్లుగా మాట్లాడాడు.

"మెస్సాలా వెళ్ళినతరువాత తిర్జా ఒకటే ఏడుపు. గుండె బద్దలుఅవుతుందేమోనని భయపడ్డాను."

"ఇప్పుడు ఎక్కడ ఉందమ్మా, తిర్జా?"

"బాల్కనీలో ఉంది. మెస్సాలా తనసైనికులతో కలిసి మనవీధిలో ఊరేగుతూ వెళ్ళేటప్పుడు కనుపిస్తాడని ఆశ ఆ పిల్లదానికి. అమాయకురాలు. దానిని ఎలాగో ఓదార్చాలి, నువ్వు. జూడా, ఇంక తిర్జా దగ్గరికి వెళ్ళు."

బెన్-హర్ మెల్లగా మెట్లు ఎక్కి బాల్కనీ మీదికి వెళ్ళాడు. తిర్జా అదివరకే అక్కడ చేరి పిట్టగోడమీదినుంచి ముందుకు వంగి రాజలాంఛనాలతో ఊరేగుతూ వెళ్ళుతున్న రోమన్ సైనికదళాల వంక చూస్తూ నిలిచి ఉన్నది.

ఆవీధి అంత విశాలమైనది కాదు. ప్రపంచమంతా స్వాధీనపరచుకొన్న రోమన్ సైనికులు కవచధారులై 'సెంచూరియన్స్' నాయకత్వన వటాటోపంతో బారులుతీర్చి నడక సాగిస్తున్నారు.

సైనికుల కోలాహలంతో ఉక్కు కవచాల ఆయుధాల గణగణధ్వనులు మోతలిస్తున్నవి.

రహదారికి ఇరువంకలా జెరూసలేమ్ నగర సైనికదళాలవారు బారులు తీర్చి నిలిచి వున్నారు. వారు ధరించిన కవచాలు ఆయుధాలు ఆ మండుటెండలో మెరసిపోతున్నవి. బారులుతీర్చిన సైనికులవెనుక నగరంలోని సామాన్యప్రజలు నిలిచిఉన్నారు.

కాని అక్కడచేరిన సామాన్యప్రజానీకం మౌనముద్రాంకితమై ఉన్నది. కొత్త గవర్నరు వెలీరియస్ గ్రాటస్ సమీపించినప్పుడు అయినా వారు హర్షధ్వానాలు చేయలేదు. బవిరిగడ్డం ఉన్న వృద్ధయూదు ఒకడు గవర్నరు కనుపించగానే ప్రక్కకు తిరిగి అసహ్యంతో ఉమ్మివేశాడు.

ఈచర్య గమనించిన బెన్-హర్ చిరునవ్వు నవ్వాడు. "రోమనులు ఏమిచేసినాసరే, నా జూడా ప్రజలు ఎన్నడూ దాస్యశృంఖలాలు తగిలించుకొనరు!" విగ్రరగా అన్నాడు బెన్-హర్.

అతడు మాట్లాడుతూఉండగా తిర్జా అతని చేయి గట్టిగా పట్టుకొన్నది. పిట్టగోడకు ఇంకా దగ్గరగా వెళ్ళింది "అడుగో, మెస్సాలా. జూడా, మెస్సాలా అడుగో, చూడు. అతడు నిజంగానే పూర్తిగా మారిపోయాడా?" అన్నది తిర్జా.

## పెంకుపడిన పరిణామం

కాని మెస్సాలా ఆలోచనలో తిర్జాకు స్థానం లేదు. అతని చూపులవైపుకూడా తిర్జా సోకలేదు. మెస్సాలా సూటిగా ముందుకు చూస్తున్నాడు. చిన్నతనంలో తాను ఆనందంగా అనేక దినాలు గడిపిన గృహం సమీపించినసంగతి బాగా తెలిసికూడా అతడు తిర్జా, బెన్-హర్ ఉన్న బాల్కనీవంక ఒక్కసారి అయినా చూడలేదు.

మెస్సాలా హృదయం అర్థం చేసుకొన్న తిర్జా గుండె బ్రద్దలు అయినది. దుఃఖం పెల్లుబికింది. గోలుగోలున ఏడ్వసాగింది. ఓదార్చడానికి బెన్-హర్ ఆమెను పొదివి పట్టుకొన్నాడు. అతని చేయి విదిలించుకొని ముందుకు అడుగువేసింది తిర్జా. అడుగువేసినంతలో ఆమె కూలిపిట్టగోడ అంచుమీద పడినది. క్రిందపడిపోకుండా కాపాడుకొనే ప్రయత్నంలో చేయి చాచినది తిర్జా.

ఆమె చేయి పెంకుమీదపడింది. పగిలీ చెక్కిన పెంకు అది. చాలా బరువైనదీని. సంవత్సరాలుగా సున్నం ఊడిపోయి వదులుగా ఉన్నది అది. తిర్జా చేయి దానిమీద పడగానే మిగిలి ఉన్న రవంత సున్నపుపట్టు విడిచింది. పెంకు ఊడి చక్కగా వీధిలో పడింది.

ఏమి చేయడానికి అవకాశం లేదు. బెన్-హర్ నిశ్చేష్టుడై చూస్తూ ఉన్నాడు.

ఆ పెంకు గాలిలో పిల్లి మొగ్గలువేస్తూ వెళ్ళి వెళ్ళి రాజవీధిలో ఊరేగుతూ వెళ్ళుతూ ఉన్న కొత్త గవర్నరు నెత్తిమీద పడింది.

బరువైన పెంకు. చాలా ఎత్తునుంచి



చేతిపనులతో తయారుచేసిన సరకుల ఎగుమతిదారుల సంఘానికి ఇటీవల కేంద్ర వాణిజ్య పారిశ్రామికశాఖ మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఢిల్లీలో ప్రారంభోత్సవం జరిపారు.

## న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

### 'మెషీన్ ట్యూల్' దిగుమతి

# తూర్పు యూరోపు దేశాలవైపు మొగ్గు: బ్రిటన్‌కు దెబ్బ

మూల్యం రూపాయి కరెన్సీలో చెల్లించే పద్ధతిమీద 'మెషీన్ టూల్స్' దిగుమతి చేయడానికి భారత ప్రభుత్వం తూర్పు యూరోపు దేశాలతో ఒప్పందాలు జరుపుకొన్నది. తత్ఫలితంగా బ్రిటన్‌నుండి మెషీన్ టూల్స్ దిగుమతులు తగ్గిపోవడము, క్రమంగా తూర్పు యూరోపు దేశాలనుంచి అంతకంతకు అధికంగా దిగుమతి చేయడము జరుగుతున్నదని బ్రిటిష్ మెషీన్ టూల్ పరిశ్రమకు సంబంధించిన వారు చెబుతున్నారు. తూర్పు యూరోపు దేశాలవారు తమవద్ద నిలువ ఉన్న సరకులో నుంచి మెషీన్ టూల్స్ సరఫరా చేయగలమంటూ మనదేశంలోని వార్తా పత్రికలలో తరచుగా వాణిజ్య ప్రకటనలుకూడా చేస్తున్నారు. చిరకాలంగా బ్రిటిష్ మెషీన్ టూల్స్ దిగుమతి చేస్తున్న వ్యాపారస్తులకు చాలా తక్కువ కోటాలు మాత్రమే ఇస్తున్న కారణంచేత వారు అధికంగా నిలువచేసి విక్రయించడానికి వీలులేకుండా పోతున్నది. ఇది బ్రిటిష్ మెషీన్ టూల్ పరిశ్రమకు దెబ్బఅని ఆపరిశ్రమకు సంబంధించిన వారు అంటున్నారు.

తూర్పు యూరోపు దేశాలవారు నిలువలలోనుంచి మెషీన్ టూల్స్ విక్రయించగలరనే వాణిజ్య ప్రకటనలు ఒక కలకత్తా వార్తాపత్రికలో ఏప్రిల్‌లో 18, మేలో 19 ప్రచురితమైనవి. ఈ పరికరాలలో అధికభాగాన్ని ప్రభుత్వ వాణిజ్య సంస్థ దిగుమతి చేస్తున్నది.

ఈ ఏడాది మే 80వ తేదీని 1, 24.7 లక్షల రూపాయిల విలువకలిగిన మెషీన్ టూల్స్, జూన్ 11న రు 86 లక్షల విలువ కలిగినవి, జూన్ 18న రు 1,81 8 లక్షల విలువకలిగినవి దిగుమతి చేయడానికి ప్రభుత్వ వాణిజ్య సంస్థకు అనుమతి ఇచ్చినట్లు అధికార ప్రకటనలలో ఉన్నది. వాటి మొత్తం విలువ రు 2,92.5 లక్షలు.

క్రిందటి ఏడాది మే, జూన్ నెలలో మొత్తం రు 1.88 కోట్ల విలువకలిగిన మెషీన్ టూల్స్, ఆగస్టులో రు 70 లక్షల విలువ కలిగినవి దిగుమతి చేయడానికి ఆసంస్థకు అనుమతి ఇవ్వడం జరిగినది. ఆ ఒక్క ఏడాది మొత్తం రు 2 08 కోట్ల విలువకలిగిన పరికరాల దిగుమతికి ఆసంస్థకు అనుమతి లభించినది

వినియోగదారులు దిగుమతి అనుమతి కొరకు దరఖాస్తులు పెట్టుకొన్నప్పుడు తూర్పు యూరోపుదేశాలలో నిలువఉన్న సరకులోనుంచి అవసరమైన వాటిని కొనమని అధికారులు చెబుతున్నారట. ఇప్పటికి అమలులోఉన్న దిగుమతి విధానంక్రింద దిగుమతి నిషేధించిన రకాల మెషీన్ టూల్సు

(67-వ పేజీ చూడండి)

"పైవిధి యత్నిస్తున్నావు! ఏలా ప్రశ్నించాలనుకుంటున్నావు?"

"ఏదో చేస్తాను. అవసరమయితే ఎవరి ఇంట్లోనైనా వంటకు కుదిరి నా పిల్లల్ని పోషించుకుంటాను. ఎవరికీ భారం కాదల్చుకోలేదు."

మల్లిబాబు ముఖం ముడుచుకుని "బాగా ఆలోచించే మాట్లాడుతున్నావా రమణా?" అన్నాడు.

ఆమె దృఢమైన స్వరంతో "తెలిసే మాట్లాడుతున్నాను. ఒకరికి భారమై బ్రతికేకంటే ఇంకే మార్గమయినా మంచిదే అనుకుంటాను" అంది.

"కాదు. కాదు. నువ్వు పొరబడుతున్నావు."

"లేదు. బాగా ఆలోచించే మాట్లాడుతున్నాను. ఏనాడయితే ఒక వయోపరిపక్వుడైన ముసలివాని పాలపడ్డానో ఆనాడే నాలోని మానాభిమానాలు, కోరికలూ, ఆనందం అన్నీ మంటగలిశాయి. జీవచ్ఛవంలా బ్రతుకుతున్నాను. ఈ కష్టైన ఎక్కడయితే ఏమిటి?"

వినలేక "ఒక్క అయిదురోజులు ఆగు. ఆతర్వాత ఎలాచేస్తే బాగుంటుందో ఒకనిర్ణయానికివద్దాం. దయుంచి అంతవరకు ఇలాంటి హృదయ విదారకమైన మాటలు అనకు రమణా" అని ఇవతలికి వస్తూంటే ఆమెనిట్టూర్పు వినిపించింది మల్లిబాబుకు.

దీపం టేబుల్ మీద పెట్టుకుని లక్ష్మణరావుకు సుదీర్ఘమైన ఒకఉత్తరం రాశాడు.

"నాకు అక్కడే ఉండగా తెలిసిన వర్తమానం బాలాపాతకే. నేను ఇక్కడికి వచ్చేవరకీ నాన్నగారుపోయి తెల్లాళయిందని తెలిసింది. పెద్దవాడయాడు. ఆయన పోవటంలో పెద్దబాధ పడవలసింది ఏమీలేదు. కాని ఆయనపోతూ ఒకయువతి జీవితం బుగ్గిచేసి మరీపోయాడు. ఇలా పొడి పొడిగా రాస్తే మీకు అర్థం కాదనుకుంటాను. అసలునాకథ యావత్తూ చెబుతాను వినండి. మీరు నాకథ అడిగినప్పుడల్లా ఎప్పుడో ఒకప్పుడు చెబుతాను అని తప్పించుకుంటూండే వాణ్ని. దురదృష్టవశాత్తూ ఆ అవసరం ఇప్పుడు వచ్చింది.

మా నాన్న బడిపంతులు ఉద్యోగంతో పాటు బయట పదిమందికీ ప్రయివేట్లు చెబుతూ నెలకు బాగానే సంపాదిస్తూ ఉండేవాడు. అయితే ఆయనకు కొన్ని దురలవాట్లు ఉండటంవల్ల ఆ వచ్చినదాంట్లో కొంతవరకూ పోతూండేది. అమ్మ తెలివైంది గనక నేర్పుగా సంసారం గడుపుకునేది. రెండు సంవత్సరాలక్రితం అమ్మ కాన్పు గండమై చనిపోయింది. కాన్పువస్తే ఇక బతకదని డాక్టరు నాలుగు సంవత్సరాల క్రితమే చెప్పాడు. అయినా ఆ ఇద్దరిలో ఒకరిభయం వల్లా మరొకరి మదంవల్లా ఈ ఘోరం జరిగి

# జీవనగంగ

పోయింది. ఇదో రకం హత్య! అందుకే ఆ తండ్రిమీద శ్రద్ధా భక్తీ నాకు పోయాయి. బ్రతికినన్నాళ్ళూ భయంతోనే బ్రతికింది అమ్మ. అయినా దెబ్బలు తింటూనే ఉండేది. పిల్లలుకూడా ఆయనదగ్గరికి చనువుగా వెళ్ళేవారు కారు. అమ్మ మరణంతో నాలో నిద్రాణమైఉన్న శక్తులన్నీ మేలుకొన్నాయి. అమ్మచెల్లెలు రమణమ్మను, పదహారేళ్ళ చిన్నపిల్లను నాన్నకిచ్చి పెళ్లి చెయ్యాలని గూడుపుఠాణీ సాగించారు. నాన్న ఊళ్లో ఓ పంతులుగార్ని అడ్డంపెట్టుకుని నాటకం ఆడించాడు. మొత్తంమీద పెళ్లి నిశ్చయం అయిపోయింది. ఆ పిల్లతో సంప్రదించకుండా వాళ్లు ఈపనిచేస్తుంటే నేను నా శక్తికొలదీ ప్రతిఘటించాను. 'నేను పెళ్లి చేసుకుని పిల్లల్ని పెంచుతాను. ఈ ప్రయత్నం మానుకో' అని చెప్పాను. ఆయన వినిపించుకోలేదు. పిల్లతల్లివాళ్లు కూడా అదేపట్టుదలలో ఉన్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఏమిచెయ్యాలో బోధపడక ఇల్లువిడిచి విశాఖపట్నం పారిపోయి వచ్చాను. నాన్న ఒకహత్యచేసి కడుపు నిండక రెండోవైపుకు వల ఒడుపుగా విసిరాడు. రమణ అందులో గిలగిలా తన్నుకుంటూంటే ఆ బీభత్సం చూడలేక ఈపని చేశాను. ఇది బలహీనతే కావచ్చు. కాని అంతకంటె మార్గాంతరం నాకు కనిపించలేదు. అదృష్టంబాగుండి మీ ఆదరణ పొందాను. నాలో అమృతంపోసి బ్రతికించారు మీరంతాను. మీరంతా నాకు గురుతుల్యులుగా భావించుకుంటుంటాను. ఒక తప్పుచేస్తే దాని పర్యవసానం ఎవరో ఒకరు భరించకతప్పదు. అచ్చంగా నాపరిస్థితికూడా మధుసూదనం

ఒక పిచ్చివాడు—నాగుప్పిడిలో ఏముందో చెప్పుకో, చూద్దాం!

రెండవపిచ్చివాడు—రైలుబండి.

ఒ—కాదు.

రెం—విమానం.

ఒ—తప్పు.

రెం—అయితే ఏనుగు.

ఒ—అమ్మదొంగా, చూసి చెబుతున్నావు కదూ.?

—కె. ఎస్. శాస్త్రి.

పరిస్థితిలాగానే తయారయింది. రమణ—ముగ్గురుపిల్లలు నా మెడకు చుట్టుకోబోతున్నారు. "నాగురించి నువ్వు ఆలోచించవద్దు. నాదారి నేచూసుకుంటాను" అని ఆమె అంటూనేఉంది. అయితే అంత మాత్రాన ఆమెమానాన ఆమెను వదిలెయ్యటం ఎలా? అన్యాయంకదూ! అందుకు నా మనసు ఒప్పటంలేదు. మార్గాంతరం బోధపడటంలేదు. వంటచెయ్యటంకూడా ఆమె ఈ మధ్యనే నేర్చుకుందేమో అనుకుంటాను. అంతకు తప్పించి ఆమెకు ఏవీ చేతకాదు. ఆమెతండ్రి కూడా ఈమధ్యనే పోయాడు. ఆమెతల్లి పెదకొడుకుదగ్గర ఉంటూంది. అతను చాలా పేదవాడు. ఏవిధంగా చూసినా నేను తప్పించుకునే మార్గంలేదు. "నాజీవితంఏమికావాలి? నేనెందుకు బాధలుపడాలి? నాకలలు నేను ఎందుకు చెరుపుకోవాలి? దీనికంతా నేనెందుకు బాధ్యతవహించాలి? ఒకరు చేసిన తప్పుకు నేనెందుకు శిక్ష అనుభవించాలి?" అని ఒకప్పుడు అనిపిస్తూంటుంది. మరునిమిషంలోనే "అయ్యో ఆ అమాయకురాలు ఏమయిపోతుంది. ఆపిల్లలు ఏమయిపోతారు?" అనిపిస్తుంది. హృదయం కరిగిపోతుంది.

ఇలా ఇదమిత్థమని తేల్చలేని సందిగ్ధావస్థలో కొట్టుమిట్టాడుతున్నాను. ఇప్పుడు నన్నేంచెయ్యమంటారు? మీ సలహాకోసం ఎదురుచూస్తూఉంటాను. వెంటనే సమాధానం రాస్తారుకదూ?" అని ఉత్తరం ముగించాడు.

అమర్నాథ్ ఆ ఉత్తరం పోస్టుచేశాడు. అప్పటికి అతని హృదయం తేలికపడినట్టయింది. ఒకసలహా తప్పకుండా వస్తుందని అతని నమ్మకం.

సాయంత్రం అన్నపూర్ణ వచ్చింది. ఒక చేతిలో కూపు, కత్తెర, ఒకచేతిలో చిన్న గుడ్డలమూటతోనూవచ్చి బయట మంచంమీద కూర్చున్న మల్లిబాబుతో నాలుగుమాటలు చెప్పి రమణా అంటూ చనువుగా లోపలికి వెళ్ళిపోయింది.

పొయ్యి అలుకుతూన్న రమణ వెనక్కితిరిగి "నువ్వా అన్నపూర్ణా" రా అంటూ ఎడంచేత్తో పీట తెచ్చి గుమ్మంవారగా వేసింది.

అన్నపూర్ణ పీటమీద కూర్చుంటూ ఉయ్యాలలో పాపను తీసుకుని గుడ్డలమూటలోంచి ఒక సిల్కుఫ్రాక్కుతీసి తొడుగుతూ "చూడు రమణా పాపాయి ఎంత బాగున్నాడో" అంటూ మురిసిపోయింది.

"ఎందుకు అన్నపూర్ణా అంతంత ఖరీదైన గుడ్డలు కుట్టి తెస్తూంటావు.?"

"ఫర్వాలేదులే రమణా! నాసంపాదనంతా తెచ్చి మీకు పెట్టటంలేదు. గుడ్డల్లో మిగులుతూంటాయి. నాకు అదో సరదా."

"వంటయిందా అన్నపూర్ణా?"

"లేదమ్మా. ఇప్పుడు పోయి చెయ్యాలి. బాబు బడి వదిలి వచ్చి ఉంటాడు.



వస్తాను. పిల్లలెలాగున్నారో చూసిపోదామని వచ్చాను" అని ఆమె పిల్లవాడ్ని ఉయ్యాలలో పడుకోబెట్టి సిల్కు చొక్కా ముడతపెట్టి పరుపుకింద పెట్టి వరండాలోకి వచ్చింది.

మల్లిబాబు పెద్ద తమ్ముడుతో కబుర్లు చెబుతున్నాడు.

అన్నపూర్ణ "ఇంటిముందు ఇంత స్థలం ఖాళీగా వదిలేశారు దేనికి? కూరగాయలు పండించుకుంటే బాగుండేదిగా" అంది.

"అది మంచి ఉద్దేశమే గాని ఇంటాయన ఒప్పుకోవాలిగా" అన్నాడు మల్లిబాబు.

"అదిసరేగాని, ఇక్కడే ఏదైనా ఉద్యోగం చూసుకుని ఉండిపోరాదూ!" అంది అన్నపూర్ణ గొంతు తగ్గించి.

"అంతకంటె మార్గాంతరం లేకపోతే అలానే చేస్తాను."

## 35

విశాఖపట్నం నుంచి ఉత్తరం వచ్చింది. ఉత్తరం రాధ రాసింది. అతను కొంత ఆశ్చర్యపోయాడు. ముత్యాలు పరిచినట్టుగా ఉన్న అక్షరాలను చూసి మెచ్చుకుంటూ ఉత్తరం చదవటం మొదలుపెట్టాడు. రత్నమ్మ పెరట్లో బట్టలు ఉతుక్కుంటూంది.

"మీ ఉత్తరం అందింది. బావ మీ ఉత్తరం నా చేతికిచ్చి నీ అభిప్రాయం ఏమిటన్నాడు. నేను చెప్పాను. 'అయితే ఆ ఉత్తరం నువ్వే రాయి. స్త్రీకి సంబంధించిన వ్యవహారంలో నేను జోక్యం చేసుకోవటం బాగుండదు. ఒక స్త్రీయే అలాంటి సలహా ఇవ్వటం ఉచితంగా ఉంటుంది' అన్నాడు బావ. అందుకని నేనే రాస్తున్నాను. నేను బాగా ఆలోచించే ఈ నాలుగు ముక్కలూ రాస్తున్నాను. మీరు వెళ్ళిం తర్వాత ఒకనాడు మీ గది సర్దుతూంటే మీ పుస్తకాలలో కొన్ని డైరీలు కనిపించాయి. అవి చదవకూడదనుకుంటూనే చదివాను. ఈ తప్పిదానికి క్షమించండి. అందులో అక్కడా అక్కడా రాసిన విషయాలనుబట్టి మీ కుటుంబ సమస్యలు నాకు చాలావరకూ అర్థం అయ్యాయి. ఇంతలో మీ ఉత్తరం వచ్చి మరికొన్ని సంగతులు తెలియజేసింది. అప్పుడప్పుడు మీరు ఎందుకు బాధపడుతూండేవారో ఇప్పుడు నాకు పూర్తిగా అర్థమయింది. మీ రవణకు నా సానుభూతి అందజేయ్యండి. అన్నపూర్ణమ్మకు నా నమస్కారాలు అందజేయ్యండి. అవిడ నాకు ఎలా తెలుసని ఆశ్చర్యపోతున్నారా! మీ డైరీలో ఆమె చరిత్ర కూడా ఉంది. ఆమెను నా హృదయంలో అలా నిలబెట్టుకున్నాను. మీరు రాసినట్టు అన్నయ్య ఎదుర్కొనవలసిన సమస్యలాంటిదే ఇప్పుడు మిమ్మల్ని కూడా ఉక్కిరి బిక్కిరి చేస్తూంది. అతను ఎలా తప్పించుకోలేకపోయాడో మీరూ అలాగే తప్పించుకోలేరు. కారణం అది మన న్యాయం కాబట్టి. అన్నయ్య దగ్గర్నుంచి ఒక ఉత్తరం వచ్చింది. బావ వెంటనే సమాధానం రాశాడు. ఆ ఉత్తరం ప్రకారం ఈ నెలాఖరికల్లా అమ్మా, చెల్లెళ్ళూ పిల్లలూ ఇక్కడికి వచ్చేస్తారనుకుంటాను. ఇక్కడే ఈ మధ్య స్త్రీ సంక్షేమ కార్యాలయం ఒకటి స్థాపించారు. అందులో స్త్రీలకు ముఖ్యంగా చదువురాని స్త్రీలకు అన్ని రకాల చేతిపనులూ నేర్పుతున్నారు. బట్టలు కుట్టటం కూడా నేర్పుతున్నారు. చెల్లెళ్ళను అందులో చేర్పించాలని అనుకుంటున్నాం. అక్కయ్యకూడా చేరతానంటూంది. ఒకటి రెండు నెలల్లో ... మాసాలు నేర్చుకుంటే ఆ తర్వాత ఒక మిషను కొనుక్కుంటే రోజులు నిక్షేపంగా గడవవచ్చు. నా నమ్మకం ఒప్పుకుండి. ఇందులో ఆక్షేపణీయమయినది, కించపడవలసింది ఏమీలేదు. లోకులేమో అనుకొంటారు. లోకులు ఎప్పుడూ ఏదో అనుకుంటూనే ఉంటారు. కార్యాలయంవాళ్ళు కొన్ని బట్టలు కుట్టించి కొంత కమీషను కూడా ఇస్తారు. స్వతంత్ర జీవనం. నేను టైపు నేర్చుకుంటున్నాను. మీరు మళ్ళీ రాగానే హిందీ మొదలుపెడతాను. సుగుణమ్మగురించి ఇక దిగులు లేదు. ఈ విధంగా

# జీవనగంగ

ఒక పెద్ద సమస్య పరిష్కారం అయింది. ఈ విషయం తెలిసి బంధువులంతా ఎంత గొడవ చేస్తారో నాకు తెలుసు. బావపోయిననాడు ఆమెను వదిలేసిన వాళ్ళంతా ఇప్పుడు పౌరుషాలు చూపిస్తారు. అయినా లక్ష్యం చేసేది లేదు. మీ స్థానం నేను అధిష్ఠించి పిల్లలకు చదువులు చెబుతున్నాను. బాగానే చెబుతున్నానని బావ సర్టిఫికెట్టు కూడా ఇచ్చాడు.

"సరే అసలు విషయానికి వద్దాం. 'రమణమ్మను ఏం చెయ్యమంటారు' అంటూ బావను సలహా అడుగుతూ ఉత్తరం రాశారు. ఇది నామటుకు నాకు ఏమాత్రం బాగులేదు. నాకు చాలా కష్టం కూడా వేసింది. మీరు చేసినపనికి రమణమ్మను తల్చుకుంటే ఆ రాత్రి భోజనం కూడా సయించలేదు. ఒక అనాథస్త్రీని అలా అనిశ్చిత స్థితిలో నిలబెట్టి ఇంతదూరం సలహాకు రాశారంటే ఆమెస్థితి తల్చుకుంటే గుండెలు తరుక్కుపోతున్నాయి. ఆమెను మీరు అగౌరవపరుస్తున్నారని నాకనిపించింది. ఏమీ అనుకోకుండా ఉంటే ఒకవిషయం చెప్పదల్చుకున్నాను. ఇలాంటి కుటుంబ విషయాల్లో పరాయివాళ్ళను సంప్రదించటం భావ్యం కాదు. అన్నపూర్ణ గారుకూడా బహుశా ఇలాంటి సలహాయే ఇచ్చి ఉంటారనుకుంటాను. మీకు ఎలాతోస్తే అలాచెయ్యండి. కాని ఒకవిషయం చెప్పే అర్హత నాకుంది. నాకేకాదు ఎవరికైనాఉంది. ఆమెను ఆమె అదృష్టానికివదిలి స్వార్థంతో ఇదివరకు చేసినట్టుగా పారిపోయిరావద్దని మనవిచేస్తున్నాను. ఆమె గౌరవంగా జీవించాలి. ఆ పిల్లలు వృద్ధిలోకిరావాలి. ఈ రెండు బాధ్యతలూ మీరు వహించినాసరే, లేదా ఇంకేదయినా మార్గం ఆలోచించినాసరే. మళ్ళీ వివరంగా సమాధానంరాయండి. ఉంటాను".

ఆ ఉత్తరం అతనిలో తీవ్రమయిన సంచలనాన్ని తెచ్చింది. అతను కళ్ళు వత్తుకుంటూ "ఎంత తప్పు చేశాను" అనుకున్నాడు.

"రమణా! నిన్ను నడివీధిలో నిలబెట్టి ఎవరినో తీర్పు చెప్పమన్నాను. నన్ను క్షమించు" అనుకున్నాడు బాధగా.

పరాకుగా ఆలోచిస్తూ ఉత్తరం టేబిల్ మీదే ఉంచి అతను పచార్లుచెయ్యసాగాడు.

అయితే రాధ ఉద్దేశ్యం తను ఆమెను పోషించాలనేనా? ఇదే అభిప్రాయాన్ని అన్నపూర్ణ కూడా వ్యక్తంచేసింది. వీళ్ళంతా ఆడవాళ్ళు కాబట్టి ఇలా పక్షపాతంతో చెబుతున్నారా? లక్ష సందేహాలు అతనిలో రేగాయి.

ఆ ఉత్తరం తీసుకుని అన్నపూర్ణను కలుసుకుందుకు వెళ్లాడు. అతను లోపలికి అడుగు పెడుతూనే లోపల మొగగొంతు విని ఆగిపోయాడు. బయట అడుగుల చప్పుడుకు అన్నపూర్ణ ఇవతలికి వచ్చి "నువ్వా తమ్ముడూ, రా," అంది. తల బాగా నూనె దువ్వి గా మీసాలు ఉన్న ఒక వ్యక్తి ఆమె వెనకాలే వచ్చి నిలబడి చూస్తున్నాడు. లోతుకు పోయిన ఆ కళ్ళలో నిర్మలత్వం లేక నిశ్చలత లేక మొదటి చూపులోనే మల్లిబాబు అర్థం చేసుకున్నాడు. ఐతే తను అపోహపడ్డా డన్నమాట. ఈమె అనుంగళి కాదన్నమాట.

మల్లిబాబు కుర్చీలో కూర్చుంటూ "అక్కా వీరెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

ఆమె ఆయన పక్కగా వెళ్లి నిలబడి— "నా భర్త" అంది.

ఆ వ్యక్తి కులుకుతూ "మీగురించి చెప్పిం దండి అన్నాడు. ఆ వ్యక్తి ఎంతో చనువుగా దగ్గరకు వచ్చి కూర్చుని "బాబూ ఒక విషయం చెబుతాను. ఆలకించండి. తప్పులు అందరూ చేస్తారు. నేనూ తప్పు చేశాను. ఒప్పుకుంటున్నానుగా. లెంపలు వాయించుకున్నాను. కావాలంటే కాళ్లు పట్టుకుంటా నంటున్నాను. ఇకమీదట పువ్వుల్లో పెట్టుకుని చూసుకుంటా నంటినిగా. క్షమించమని వేడుకుంటూంటే నమ్మకపోతే ఎలా బాబూ మీరయినా చెప్పండి బాబూ." అంటూ ప్రాధేయపడుతూంటే—

"చెప్పండి. మీ రెలా చెబితే అలా చేస్తాను" అంది అన్నపూర్ణ.

కొన్ని రోజుల క్రితం తన విషయంలో ఆమె ఇచ్చిన సలహాయే అప్పచెబుతూ— "ఇలాంటి కుటుంబ వ్యవహారాల్లో ఇతరులు సలహాలు ఇవ్వటం ఉచితం కాదు అక్కా" అన్నాడు మల్లిబాబు.

ఉపాధ్యాయుడు—పిల్లలు బడికి ఎందుకు వస్తారు?

విద్యార్థి: బడి కాదు కాబట్టి.

* * *

తండ్రి—నెమరు వేసేవి రెంటి పేర్లు చెప్పరా.

కొడుకు — బామ్మ, తాతయ్య.

* * *

తండ్రి—"అమ్మలగన్న యమ్మ..." ఎవరురా?

కొడుకు—అమ్మమ్మ

—జి. ఎల్. ఎన్. శాస్త్రి (బందరు)

ఆమె అర్థం చేసుకుని నిట్టూర్చి "నువ్వింత గడుసువాడవని అనుకోలేదు" అంది.

ఆ వ్యక్తి మల్లిబాబును వదిలిపెట్టి అన్నపూర్ణ పక్కకి వెళ్లి కూర్చుని "జరిగిందంతా మర్చిపో. ఇకమీదట సుఖంగా జీవిద్దాం. నిన్ను వదిలేస్తూ మాటంటే చెప్పు తీసుకుని కొట్టు. నామాట విను. వేళకు తిండిలేక, ఆదరణ లేక ఎలా అయిపోయానో చూడు" అంటూ ప్రాధేయపడుతున్నాడు.

బాబు తల్లి పక్కగా వచ్చి నిలబడ్డాడు. ఆ వ్యక్తి బాబును తీసుకుంటూ "నా బాబు నన్ను మరిచిపోయాడు పాపిష్టివాణ్ని," అనుకుని కన్నీటి తుడుచుకున్నాడు.

ఆమె చేతిలో జాకెట్టు పక్కకి పెడుతూ "ఇక్కడే ఉండిపోరాదూ అని నేనంటున్నాను. ఎందుకు ఉండకూడదూ?" అంది.

"ఎంతయినా మొగముండావాణ్ని. నువ్వు సంపాదించడం, నేను తినటమూనా? కలప వ్యాపారంలో అక్కడ భాగం వుంది. వ్యాపారం చూసుకోవద్దూ? నెలమీద లాభాలు పంచుకుంటాం. అంతా ఆనందంగా గడుపుదాం. కాదనకు."

"అంత డబ్బు నాకు దేనికి? మనకు ఈ డబ్బు చాలు. కావలిస్తే ఇక్కడే ఏదన్నా ఉద్యోగం చేద్దురుగాని."

"అంత వ్యాపారం వదిలి ఇక్కడ పడుండని ఉండమంటావు చెప్పు. నా మాట విను అన్నపూర్ణా. కావలిస్తే దేముడిముందు ప్రమాణం చేస్తాను. ఈ పెద్దమనిషి సాక్ష్యం ఉన్నారు."—పిల్లవాడు అతని ఒళ్లోంచి లేచి ఇవతలికి వచ్చేశాడు.

మల్లిబాబు వింటూ కూర్చున్నాడు.

అన్నపూర్ణ సందిగ్ధావస్థలో పడిందని అతను గ్రహించి "అక్కా— నేను వెళ్ళనా" అంటూ లేవబోతూంటే ఆ వ్యక్తి వారిస్తూ "కూచోనాయనా. కాసేపుకూర్చో నువ్వు ఎంత కాదనుకున్నా ఈ వ్యవహారం పరిష్కరించి మరీ వెళ్లునాయనా" అని దగ్గరగా వచ్చి పక్కని కూర్చుని మల్లిబాబు చేతులు పట్టుకుని "చెప్పుబాబూ నువ్వయినా చెప్పు" అంటూ ప్రాధేయపడసాగాడు.

గుండీలులేని చొక్కాలోంచి అతని గుండెలమీద వెంట్రుకలు బయటికి తొంగి చూస్తున్నాయి. అతను జుట్టు బరుక్కుంటూ జాలిచూపులు చూస్తున్నాడు.

"అన్నపూర్ణ అక్కయ్య చాలా తెలివైనది. ఆమె చెప్పినట్టు చెయ్యరాదూ" అన్నాడు మల్లిబాబు.

"అది అనుమానంతో చేసేసూచన బాబూ అనుమానం వద్దంటున్నాను. నేను పూర్తిగా మారిపోయానని హామీ ఇస్తున్నాను." అంటూ అతని కుడి అరిచేతిని తలమీద పెట్టుకున్నాడు.

అన్నపూర్ణ "సరి లెండి. కాస్తమీరు ఊరుకోండి. తాపీగా ఆలోచించుకుందాం" అంది.

ఆమె కి నవ్వి "వరాలుగా విన్నాను. ఆఖరి మాటలుమాత్రం విన్నాను" అంది. అతను మళ్ళీ అంతా చెప్పి "ఇప్పుడయినా విన్నావా?" అన్నాడు.

"ఆమె చిక్కుల్లో పడింది." అంది రమణ.

"అదేమి దురదృష్టమో! కారణం తెలియదుగాని ఇలాంటి చిక్కులన్నీ ఆడవాళ్ళకే ఎదుర్కొంటూంటాయి. ప్రశాంతంగా వెళ్ళిపోయే ఆమె జీవితంలో ఈనాడు ఈ సంఘటన మంచికే వచ్చిందో చెడుకే వచ్చిందో ఎలా నిర్ణయించగలగటం?"

"మనిషికి దెబ్బ తగిలితే శరీరంలో బలహీనమైన భాగం ఏదయినా ఉంటే ఆ దెబ్బ ప్రభావం అక్కడ ఎక్కువగా కనిపిస్తుంది. అలాగే కుటుంబంలో గాని, సమాజంలోగాని తీవ్రమయిన నష్టం సంభవించినప్పుడు బలహీనులే ఎక్కువగా నలిగిపోతారు. ఆ బలహీనుల్లో ఆడవాళ్లు కూడా ఒకరు." అంది రమణ.

"అంతే. అంతే" అంటూ అతను మంచి నీళ్లు తాగి గొంతు రాసుకుంటూ "ఎప్పుడు ఏమి జరుగుతుందో మనం ఊహించగలం. ఇలా జరుగుతుంది అని మనం అనుకుంటాం. కాని అలా జరగకపోవచ్చు. ఈ జరగకపోవటాన్నే, ఆ చెప్పలేకపోవటాన్నే ఒకే మాటతో మనవాళ్ళు పిలుస్తూంటారు. అదేమిటో తెలుసా రమణా?" అన్నాడు మల్లిబాబు.

"'విధి' అని మనవాళ్లు అంటూంటారు" అంది రమణ.

"బాగా చెప్పావు. అంతకంటె మరో పదం లేదనుకుంటాను."

తలవాటున దీపం పెట్టుకుని రాధ రాసిన ఉత్తరం మళ్ళీ మళ్ళీ చదువుకుని ఉత్తరం దిండుకింద పెట్టి అతను నిద్రపోయాడు.

తలుపులన్నీ వేసుకుని రమణ పడుకునే సరికి పది దాటింది.

## 36

మర్నాడు మధ్యాహ్నం భోజనాలయి మల్లిబాబు బయటికి కదలబోతుంటే రమణ గుమ్మంలో నిలబడి "ఒక్క మాట" అంది.

అతను వెనక్కు తిరిగి "ఏమిటి రమణా?" అన్నాడు.

"ఒక్క నిమిషం కూర్చో మల్లీ" అంది రమణ.

అతను కూచున్న తర్వాత "రాధ ఎవరు మల్లీ?" అంది.

రాధ గురించీ, ఆ కుటుంబాన్ని గురించీ అంతా చెప్పి "ఇప్పుడు ఆమె ఎవరో తెలిసిందా?" అన్నాడు.

"సంతోషం. ఆమె చాలా తెలివైనదని నాకు తెలుసు."

"జబ్బుగా ఉండి మంచాన పడితే ఆమె నాకు చేసిన సేవ నా జన్మలో నేను మరచిపోలేను రమణా. నేను ఇంతవరకు అదృష్టవంతుడ్ని అని అనుకోనే అవకాశం ఏదయినా వుంటే అది వారి సాంగత్యమే అనుకుంటాను."

"ఆ ఉత్తరం నేనూ చదివాను."

అతను అదిరిపడ్డాడు. కంగారుగా "చదివావా రమణా!" అని గొణిగాడు.

"ఫర్వాలేదు మల్లీ. ఆ ఉత్తరం చదివి నేను ఎవరిగురించీ అపోహపడటం లేదు. ఆ ఉత్తరంలో ఆద్యంతం నాకు కనిపించిన అపారమైన దయాహృదయం, మానవత్వం నన్ను ముగ్ధురాలిని చేశాయి. ఆమె తెలివికి నేను ఆశ్చర్యపోయాను. నేను సుగుణమ్మ చేసిన పని ఎందుకు చెయ్యకూడదు?"

అతను ముఖం ఎత్తి "హృదయపూర్వకంగానే అంటున్నావా?" అన్నాడు.

"మనస్ఫూర్తిగా అడుగుతున్నాను. ఇంతవరకూ ఆ విషయం నాకు తట్టనేలేదు."

"అవును. అది చాలా మంచిపని."

అతను అక్కడినుంచి కొంత తేలికపడిన హృదయంతో బయటికి వచ్చాడు. 'రాధను ఇప్పుడు నిజంగా అర్థంచేసుకున్నావా?' అనుకున్నాడు. మనసులో ఆమెను అభినందించుకుంటూ, ఆమెనుగురించి మధురంగా ఆలోచిస్తూ అతను అన్నపూర్ణ ఇల్లు చేరుకున్నాడు.

కాని తలుపు తాళంవేసిఉంది. "ఈవేళ ఈమె ఎక్కడికిపోదే? అధర్మనమ్మి వెళ్ళిపోయిందా? అంత తేలిగ్గా లొంగిపోయే మనిషి కాదే. అలా జరిగిఉండదు. జరగదు. అతన్ని వదులుకోనయినా వదులుకుంటుంది గాని ఈ పటీరం విడిచిపెట్టదు. 'ఏపరిస్థితిలోనూ ఈమనుష్యుల్నీ, ఈపటీరాన్నీ వదలటం అంటూ జరగదు' అని ఒకసారి ఆమె అంది. ఆమె అన్న మాట అటునూరైనా మాట ఆరైనా తప్పే మనిషికాదు. భగవంతుడు ఆమెకు అదృఢమైన మనస్సును ఇచ్చాడు. ఆకారటుమనిషి ఆమెను వంచించలేడు. అతను మోసగాడని ఆమెకు తెలుసు."

అతను అటుట్టుపక్కల కాసేపు అటూ ఇటూ చూశాడు. ఆమె వస్తూన్నజాడలు కనబడటం లేదు.

నల్లటి పెద్ద మేఘం సూర్యుణ్ని కప్పేసింది. కాసేపు ఎండ తగ్గినట్టయి అతను కేతుయాంతో నిలుచుంటూ ఆ వంపు-చివర మూలమీదకుపోయి చూస్తున్నాడు.

ఎంతకూ ఆమె రాలేదు.

మల్లిబాబు లేచి ఇంటికి వచ్చేశాడు. నిన్న ఆమె సాగనంపుతూ అన్న మాటలు అతనికి గుర్తుకు వచ్చాయి. 'తర్వాత మీరు కనిపించరు' అని ఆమె అన్నది. దానిఅర్థం ఆమె అతనితో చెప్పదల్చుకోలేదనేగా?

పంతులుగారి సంగతి తెలుసుకోవాలనిపించింది. ఆ దిక్కుగా పోయాడు. సందుమలుపు తిరిగి ఇంటిముందు నిల్చున్న పన్నెండుసంవత్సరాల పిల్లను పలకరించాడు. ఆపిల్ల గుర్తుపట్టి "దేముడుదగ్గరకు వెళ్ళిపోయారు" అంది.

"ఎన్నాళ్ళయింది?"

"మీరు వచ్చిననాడే రాత్రి పోయారు."

(ఇంకా ఉంది)

చిత్రకారుడు : సింహాద్రి నారాయణరావు (సాలూరు)

# ప్రేమాభిషిక్తు

సి. హనుమంతశాస్త్రి

"నాలుగేళ్ళనుంచీ యూనివర్సిటీలో ఉంటూ కనీసం ఒక్క అమ్మాయిని నన్ను ప్రేమించలేదా!"

అని ఓ అందమైన సాయంకాలం, నీరెండలపచ్చటి కాంతులు వాళ్ళవీపుల్ని వెలిగిస్తుంటే, బీచ్‌లో ఇంత నాజూగ్గా కాకపోయినా ఇంతే అర్థం వచ్చేట్టు అడిగాడు, ఆరోజే అక్కడికి వచ్చిన నారాయణరావు వెంకటచలాన్ని.

గాలి చల్లగా వీస్తోంది. పక్షులు ఇంటికి పోతున్నాయి. సముద్రం హోరుమంటోంది. దూరంగా సముద్రంలోకి మురుగునీటిని వదుతున్న కాల్వన్న గొట్టంతాలూకు వాసనలు అప్పుడప్పుడు గాలిపాటున వాళ్ళనిపరామర్శిస్తున్నాయి. చుట్టూవున్న ఇసకగుట్టల్లో మోనజైట్ తాలూకు నల్లని చారికలు బొమ్మల్ని చూపెడుతున్నాయి. ఆకాశం చాలాచోట్ల బాగా ఉన్నిపట్టిన గొర్రెతోలులాగుంది. ఆ సమయంలో బసవరాజులాంటి కవికుమారుడెవడన్నా అక్కడుంటే, అమాంతం ప్రకృతిమీద ఓ మధుర కావ్యాన్ని రచించేసి లేక్ పోయెట్స్‌లో సమానమైన కీర్తిని ఏమో అదృష్టంబాగుంటే నోబుల్ ప్రైజునికూడా కొట్టేయక ఊరుకుంటాడా అనే ధర్మసందేహం వాళ్ళిద్దర్లో కలుగక పోలేదు.

అంతటి రమణీయమైన సంధ్యవేళ, సముద్రం కెరటాలు హోరుమంటూ శ్రమపడి తోశాదు తెల్లటినురుగుని వాళ్ళ కాళ్ళదగ్గరికి చేరుస్తూంటే, డాల్ఫిన్స్‌నోస్ మీది కాంతి కిరణాలు అప్పుడే నిమిషానికి ఆరుసార్లు ప్రదక్షిణం ప్రారంభించాక, వాళ్ళిద్దరూ తప్ప వేరొకరులేని ఆ ప్రశాంత వాతావరణంలో సదరు ప్రశ్న వేశాడు నారాయణరావు. ఆ దెబ్బతో చలం కాసేపు 'శూన్యం'గా— అచ్చం కథల్లోలాగానే — 'శూన్యం'లోకి చూశాడు.

"అవునండీ! హైస్కూలు పిల్ల కాయలు, కాలేజీల్లోకి అప్పుడే అడుగుపెట్టిన కుర్ర కుంకలే దారుణంగా ప్రేమించేస్తూంటే, అన్ని హంగులూ పెట్టుకుని ఇన్నేళ్ళొక్క డున్న మీరు తమాషాకన్నా ఒకర్ని ప్రేమించ లేదా!" మళ్ళీ అడిగాడు నారాయణరావు.

వెంకటచలం వెర్రి మొహం వేశాడు. అతనడిగే ధోరణి చూస్తే 'యాష్టరాల్' హైస్కూలు కుర్రాళ్లు చేయగలిగినవని నువ్వు చేయలేకపోయావనే' నింద వేస్తున్నట్టు, హేళన చేస్తున్నట్టు అనిపించింది. కాలెండరుబొమ్మల్లో గాంధీగారితలకాయకి నాలుగువేపులా బుద్ధుడు, క్రీస్తు, భారతమాత, మహావిష్ణువు నిలబడినట్టు, చలంచుట్టూ దేవదాసు, ఖయిస్, సతీసావిత్రి, వాళ్ళవూరు హైస్కూల్లో మొన్న మొన్నే చిన్నపిల్ల ప్రేమాయణం నడిపి పార్లమెంటుకు పోటీ చేయదగినంత ఖ్యాతి, కీర్తి ఆర్జించుకున్న ఒక సుభాష్‌చంద్రబోసు చుట్టుక్కన నిలబడి వాళ్ళ అనుభవాల తాలూకు అభిప్రాయాల్ని సూక్తులుగా చెప్పేస్తున్నట్టు అనిపించింది. నిజానికి తా నీ ఇరవై వసంతాలు గడిచిన జీవితంలో, ఇరవై మందిని కాకపోతేపోయె కనీసం ఇద్దరినైనా ప్రేమించలేదా! సిగ్గు సిగ్గు!

చలం మాట్లాడకపోవడంతో, నారాయణ రావే తిరిగి మొదలుపెట్టాడు:

"జేవియర్ జాన్ ఇంక ఓక్కర్లని చూడండి: కులమత భేదాలు పాటించకుండా, రాజా రామ్మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యా సాగర్...మరి, కందుకూరి వీరేశలింగం లాంటి మహామహుల అడుగుజాడల్లో వాళ్ళ జూనియర్ సుందరాంబాళ్‌ని ఫోనులో ప్రేమిస్తున్నాడు, రెండు నెల్లనుంచి. మనలో మనమాట, ఆ అమ్మాయికి గ్రామర్ నోట్సుకూడా మధ్యమధ్య డిక్టేట్ చేస్తూంటాట్ట. సరే, జేబున్నీసాకి, మహమ్మద్ దీన్‌కి ఏనాటినుంచో జరుగుతున్న వ్యవహారం ఎలాగూ వుంది. ఈమధ్య ఇద్దరూ కలిసి సినిమాలకికూడా వెళ్తున్నారు. యింకా స్వామి - రాణి, చౌదరి-చిరంజీవిని...... యిలా ఎందరో !"











చిత్రకారుడు— శ్రీ జె. సత్యనారాయణ (జగదల్‌పూర్)

టోయ్!"

చలం మరింత చిక్కుల్లో పడ్డాడు. "నీమా ప్రేమకీ అసలు ప్రేమకీ తేడా ఉంది లేవోయ్!" అన్నాడు సణుక్కుంటున్నట్టు.

"తేడా ఏముంది? ప్రేమించడ మొక కాలక్షేపం. యీ కొండగుట్టమీదపడి నాలుగయిదేళ్లు ఒకటే వరసని రాతిగోడలు, మొద్దు మొహాలు చూస్తూ గడపడం—ఎంత కష్టం! ఎంతకష్టం! పరాంకుశాన్ని చూడు, పదేళ్లనుంచీ అల్ప్యారేస్, ఉల్ప్యారేస్ అంటూ రిసెర్చి చేస్తున్నాడు. పదంగుళాల దళసరి కళ్ళద్దాలు తగిలించాడు. ఎవరు మాట్లాడినా మొదటిసారి అర్థం చేసుకోలేడు. ఎప్పుడూ పరధ్యానం. నడిచి వస్తూకూడా గాల్లో అంకెలు వేస్తాడు వేళ్లుతిప్పుతూ, పెదిమలుఆడిస్తూ...ఇందుకా యిక్కడికి వచ్చింది! యిలా పిచ్చాళ్ళయి పోడానికా!...ఒక అందమైన అమ్మాయి, కొంచెం ప్రేమ! అప్పుడప్పుడు ఫోన్‌కాల్స్. వీలయితే ఒకటి రెండుసార్లు సినిమా. చివర్న యాన్యువల్ డిన్నర్ నాడు నీతో ఫెయిర్ గెస్టు! ఏంహోయి! ఎంత రిలీఫ్! తల్చుకుంటేనే యింత తీయగా ఉంటోందా! మరి నిజంగానే యిదంతా జరిగిందనుకో, అప్పుడెల్లా ఉండేది? అందుకే ఎవడో అన్నాడు "తీయని బాధా లోలి ప్రేమా" అని. ఓపికుంటే నువ్వూ అలాంటిమాటలు నాలుగు నేర్చుకో. ఎందుకైనా మంచిది, నాలుగైదు విరహ గేయాలు కట్టి వెయ్యి..."

చీకటి తెరలు చాలా దట్టంగా అలుముకున్నాయి. హాస్పిటలు డౌన్ నుంచి హాస్టలుకి మెల్లిగా నడిచివస్తున్న కుర్రాళ్ళు సముద్రపు ఒడ్డున యీ రెండు నీడలూ ఏవో అయుంటాయని గంపెడాశతో దగ్గరసా వచ్చి చూసి పట్టలేని నిరుత్సాహంతో గబగబా దూరంగా వెళ్లిపోతున్నారు. సముద్రం కెరటాలు ఒకటి రెండడుగులు ముందుకి పాకుతున్నాయి. బీచిరోడ్డుమీద ... తోరణాల్లాగ వెలుగుతున్నా...

... నెమ్మదిగా చలాన్ని ఆలోచనల్లోంచి లేపి, టైం చెప్పాడు. చలం లక్ష టన్నులు మించిన గుండె బరువుతో, యిసకలో దిగిపోతున్న కాళ్ళని నెమ్మదిగా పైకి తీస్తుకుంటూ గదికి బయల్దేరాడు. అతని హృదయంలో ఒక లక్ష నక్షత్రాల మాటలు, ఒక కోటి జలపాతాల పాటలు, శతకోటి సముద్రతరంగాల ఘోషలు వినపడుతున్నాయి. మెస్‌లో కూడా మూగగానే ఉండిపోయాడు చలం. 'భూతాన్ని' గురించిన పశ్చాత్తాపం, భవిష్యత్తుపైన అనుమానం సందేహం అతన్ని కలచివేస్తున్నాయి.

గదికి వెళ్లాక బట్టలు మార్చుకుని సిగరెట్టు ముట్టించి టెర్రేస్ పైకి నడిచాడు, భవిష్యత్తుని గురించిన ఆలోచనల్తో మెదడంతా నింపుకొని. చుట్టూ లైట్లు భూమ్మీద నక్షత్రాల్లాగా ఉన్నాయి. హాస్టలు గదుల్లోంచి కుర్రాళ్ల వెర్రికేకలు, వెకిలినవ్వులు, క్రింద మెస్‌లో కడుగుతున్న ప్లేట్లు, గ్లాసుల చప్పుడు లయవిరుద్ధంగా వినవస్తున్నాయి. చలం టవల్తో మొగ మొకసారి గట్టిగా తుడుచుకుని వెనకవైపు పిట్టగోడమీద చీకట్లో కూర్చున్నాడు.

"హాలో చలం, ఏమిటి గిరాకీ; యీరోజిలా వచ్చావు. సినిమాకి పోలేదా!" చీకట్లో ఒక శబ్దం అతన్ని పలకరించింది.

"ఎవరది, రాజూ!......ఒక్కడివేనా, యింకెవరన్నా ఉన్నారా!"

"అఁ, నేనొక్కణ్ణే. ఏం?"

చలానికి ప్రాణం లేచివచ్చింది. ఈ రాజుగాడికి చందమామ, నక్షత్రాలు, మేఘాలు, మెరుపులు, రైనోలు లాంటివి వాట్ల భాష వచ్చు. వాడి అప్లయిడ్ మెకానిక్స్ నోట్సు నిండా కోలెడంత కవిత్వం ఉంది చిన్న చిన్న కాగితం ముక్కల రూపంలో. చందమామ, నక్షత్రాలు మొదలైనవన్నీ ప్రేమ ప్రాక్టికల్‌కి అవసరమట నన్న మాట. కాబట్టి యీ రాజుని పట్టుకుంటే పని జరుగుతుందనే దృఢనిశ్చయానికి వచ్చినవాడై, చలం—

"ఓకేయ్, రాజూ నేనొక గట్టి చిక్కులో పడ్డాన్రా. నువ్వు నా ఆప్తమిత్రుడివనుకొని నీతో చెబుతున్నాను. యిందులోంచి బయటపడేమార్గం నువ్వే చెప్పాలి" అన్నాడు.

రాజుకి నిజంగా ఆశ్చర్యం వేసింది. "నీలాంటి ఉమర్ ఖయ్యాంకి చిక్కులా మిత్రా!"

"అలా అనకు నీ మీద గంపెడాశతో ఉన్నాను. ఇప్పుడు నీ రూంకి వద్దామనుకుంటున్నాను నలం. నీ సహాయం చాలా అవసరం."

"ఇంతకీ ఏమిటోయ్ నీ చిక్కు! అంత ప్రమాదం నీ కేమొచ్చిం దిప్పుడు?"

"ప్రేమించాను......కాదు, కాదు... యింక ముందు ప్రేమించాలి."

"ఎవర్నోయ్!" గట్టిగా అరిచాడు రాజు.

"నువ్వలా నోరు తెరిచేయకప్పుడే. ఎవర్ని ప్రేమించేదీ యింకా నిర్ణయం చేసుకోలేదు. నీ సలహాకి తగిన ప్రాముఖ్యం యీయబడుతుంది ఈ విషయంలో కూడ. కాని, నువ్వు చేయాల్సిన అసలుపనేమంటే, యీ ప్రేమ మోటారుని స్టార్ట్ చేసి వదలాలి. యిహా తర్వాత దానంతటదే లక్ష ఆర్ పి యంతో గిర్రున తిరిగిపోతుంది."

"నువ్వు ప్రేమించదలచినది యిక్కడ చదువుతున్న అమ్మాయిల్నా, బయటి వాళ్ళనా, లేక సినిమా తారల్నా!"

"అబ్బే, దూరం పోతే ఎలాగరా! ఇక్కడి వాళ్ళనే."

"రైలో మరయితే ఎవర్నో తేల్చుకో ముందు. అందులో కొంతమంది యిప్పటికే ఎంగేజ్ అయుంటారు. నువ్విక్కడ కూడా లేట్ కమర్‌వే!"

"ఎవర్ని ప్రేమించాలనే విషయం నా కొదిలేసి, ఎలా ప్రేమించాలన్నది చెప్పు కొద్దిగా."

"అదే మరిరా! నాలుగురోజులపాటు నీ గాబర్డీన్లు, షార్క్ స్కిన్లు పెట్టెలో పెట్టేసి లాల్చీలు పైజమాలు పైకి తియ్యి. రోజుకొకసారి గీసేబదులు వారం రోజులపాటు గడ్డాన్ని గీయకు. తల కింత బ్రిల్‌క్రీం పట్టించి అంత మున్నగా దువ్వుకోవడం మానేసి. యీ ఏడు రోజులూ నీ బుర్రమీది వెంట్రుకలకి పూర్తిస్వాతంత్ర్యం యిచ్చెయ్యి. ఆవేశంతో నీ తీర్యకి ఎదురుగా రోజుకి కనీసం పదిసార్లయినా, ఆమెకేసి చూస్తూ తిరుగు. ఎనిమిదోరోజు కల్లా ... బాగా తయారయి, ఓ బ్రహ్మాండమైన ప్రేమ

లేఖ రాసి చట్టుగర్ని ఆమె కిచ్చెయ్యి. అంతే..."

"ఆమె ఒప్పుకోకపోతే!"

"ఒప్పుకోకం చేసుందిరా బద్రినారాయణా! నీ అయిదడుగుల ఎనిమిదింబావు అంగుళాల పొడుగు పర్సనాలిటీ, కండపిలకరంగు దేహచ్ఛాయ, చూసి రంభ, ఊర్వశి, మేనక లాంటివాళ్లు లక్షమంది క్యూలో నిలబడి ప్రేమమహజర్లు అందివ్వరూ! ...... అంతగా ఒప్పుకోలేదనుకో, జానేదో! మంజాబాణి కాకపోతే కంపాలత! వెంకమ్మ కాకపోతే మరో బుచ్చమ్మ. యీ వారంరోజుల్నీ నీ జీవితగ్రంథంలో కుదుపుపెట్టేసి మళ్ళీ మరో కరిలో ఓనమాలనుంచీ మొదలెట్టు."

వెంకటచలం తీవ్రంగా ఆలోచించసాగాడు. ప్రేమించడం యింత సింపులయితే తన కింతవరకు యీ ఐడియా ఎందుకు తట్టలేదా అని తపన తీవ్రంగా అతన్ని వేధించింది. కొద్దిసేపు ఆలోచనల గొడుగు నుంచి, రాజాకి దగ్గరగా జరిగి గొంతుతగ్గించి అన్నాడు.

"ఒకేయ్ రాజా! ఆ ప్రేమలేఖ పెట్టే ముక్కే డిక్టేట్ చెయ్యాల్రా ... కొంచెం సింపిల్‌గా ఉండాలినుమా! లేకపోతే ప్రాణానికొచ్చింది!"

# ప్రేమాయణం

రాజా నవ్వుకుని అలాగే నన్నాడు.

... ... ... ... ... ...

రోజూ అతికష్టంమీద ఎంతో బద్ధకంగా ఏడున్నరకు ఉదయించే సూర్యుడు ఆరోజు ఓగంట ముందుగానే చలం ఆకాశంలో ఉదయాద్రిని దాటివచ్చాడు. ఏడూ పదికల్లా సర్వం ముగించుకుని లాల్చీ, పైజమా, రేగిన జుట్టుతో కాలేజివైపు పోతున్న అతన్ని చూసి ప్రక్కగదులవాళ్లు, ప్రక్కబ్లాకుల వాళ్లు అంతా "హరా రాం!" అని యింగ్లీషులో ఆశ్చర్యపోయారు. చలం ఒక నిశ్చయానికి వచ్చాడు, రాత్రంతా ఆలోచించి - ఆరోజు కాలేజీ ఆవరణలో తనకెవరు ముందుకనబడితే ఆ అమ్మాయినే ప్రేమించెయ్యాలని.

"ఎక్కడికిరోయ్! తెల్లారకుండా నడిపోతున్నావు? - ఇల్లు కాల్తోందా?" నవ్వుతూ అడిగాడు వెంకట్రావు, చలం యిచ్చేసమాధానాన్ని కూడా అనుభవంమీద ఊహించేసి.

"కాదు, ప్రేమించడానికి" తెల్లమొహం వేస్తున్న వెంకట్రావుమీదికి గర్వంగా ఓ చూపుచూసి సాగిపోయాడు చలం ముందుకి.

ప్రొద్దుటి క్లాసులకి తెచ్చే స్టాండర్స్‌ని తెచ్చే మొదటిబస్సు అప్పుడే కాంపస్‌లో ఆగింది. ఆగడంతోనే గులాబీరంగు సిల్కుచీర కట్టిన యువతీమణి యొకర్తు, ఒక చేతిలో పుస్తకాలు, మరో చేత్తో బస్సుపోచలు పట్టుకుని మందమందంగా అడుగులు వేస్తూ దిగింది.

"యురేకా!" అని గట్టిగా లోపలలోనే అరుచుకున్నాడు చలం. "యీమె నా ప్రేయసి, ఊర్వశి" అనుకున్నాడు నిశ్చయంగా. (తల క్రిందికి దించుకుని కళ్లు పైకెత్తి చూస్తూ దిగుతూన్న ఆమెని ఆ క్షణంలో చూశాక చలం, "అరె, యీమె కూడా అచ్చంగా బాపూ బొమ్మలాగే ఉందే" అని కూడా అనుకున్నాడు). కండక్టరు యీల వేయడంతో బస్ కదిలింది. ఆమె ఒక్కతే దిగింది. నెమ్మదిగా వెయిటింగ్ రూంవైపు నడవసాగింది.

వెనకనున్న వెంకటచలానికి రాజా సలహా ప్రకారం ఆమెఎదుట ఎలాపడాలో తెలిసిందిగాదు. కాసేపటికి గుండెలు కూడదీసుకుని గబగబ అడుగులు వేస్తూ ఆమెను దాటి వెళ్లాడు. కొద్దిఅడుగులు ముందుకు వెళ్ళి ఆమె మొగంలోకి తీక్షణంగా చూశాడు. ఆమె ఉలిక్కిపడి యితనివంక కళ్లు తిప్పే సరికి "ఒకటి" అన్నాడు చలం.

# ★ హరివంశం

...తిలో అక్రూరుని మనస్సు శ్రీకృష్ణబలరాములమీదకు పోయింది. ఆ కృష్ణుడు ఎటువంటివాడు? ఆ బలరాముడు ఎటువంటివాడు? వారిద్దరు ఒక్కటే. వారు విశ్వగురువులు. వరదులు. ఈశ్వరులు. నారాయణమూర్తులు. అతిలోకాద్భుత భూరివిక్రములు. దేవతలకోసం ఇట్లా లీలామానుషవిగ్రహాలు ధరించి ధరిత్రిమీదకు వచ్చారు. వారిని చూడగలిగిన వాళ్ళకన్నులే కన్నులు. వారిని చూడగలిగినవాళ్ళే ధన్యతములు. తాను ఆ ధన్యతములలో ఒక్కరుడు కాగలుగుతున్నందుకు అక్రూరుడు మనస్సులో ఆనందతరంగాలుగా ప్రస్ఫురిల్లాడు.

రథంగూడా ఆనందతరంగాన్ని పోలి ముందుకు ఉరుకుతున్నది. దారిలో అతిక్రమించేవేళ కాగా, ఇండ్లకు పోతున్న బ్రాహ్మణ గృహమేధులు కన్పించగా, వారిని తొలగి నడుస్తున్నది. వానప్రస్థులైన వైఖానసులు వయస్సులు, నీవారధాన్యములు అగ్నిహోత్రంలో వ్రేలుస్తూ కృపీటయోనిని ఆహ్వానిస్తూవుంటే, వింటూ ముందుకు సాగుతోంది. దారి అంతా వనం అవడంచేత అభ్యాసతస్కరులను పోలి చీకట్లు ముసురుకుంటున్నాయి. గోవులు ఉపావృత్తములుగా పంక్తిస్తున్నాయి. ఇంటికి తిరుగుతున్న గోవులను గోపకులు పేర్లతో పిలిచి బందాలు వేస్తున్నారు. చంద్రుడు ఉదయించగా సముద్రం పొంగి ఉల్లాసంపోతున్నట్లు గోవులు భాసిల్లి అభ్రపటలంగాలనుపోలి, అత్యంత సంతసులంగా ప్రేంఖిల్లుతున్నాయి. గోపకుల రొదలు, గలలు, మధ్యమానలను ధేనువుల దుగ్ధధారా నినదాంబుల నితాంతనాదంబులు, ఒండొంటిం బ్రేమమడించి పిమ్ముఖమ్ములను తోగ్గివత్స సముదయములు విపులధ్వానమ్ములు ఒక్కుమ్మడిగా మ్రోగుతూ, ఘోషం యావత్తూ దుగ్ధరసారాశిని పురడిస్తున్నట్లు వుంది. ఆ మహాఘోషంలో అక్రూరుని రథం అవిరత మధురనినాదంగా పయనిస్తోంది.

ఘోషం అంతటా ధుక్కగోమయచూర్ణముతో నిగన్నవెల్లుతున్నాయి. గోష్ఠభారానతస్కంధులయిన గోపకులు అభ్యాగతులతో సహా అక్కడే సేదతీరుతున్నారు. కొంచెం పైకిలేచి చంద్రుడు సుందరస్నిగ్ధుడై సుఖావహంగా విరాజిల్లుతున్నాడు. అహస్సు పూర్తి కాగా రాత్రి ప్రారంభం కాబోతున్నది. సూర్యుడు తేజస్సు ఉడగగా, చంద్రుడు కాంతిని పుంజుకుంటున్నాడు. ఘోషంఅంతా అగ్నిహోత్రాపులమై, సౌమ్యేందుని మధుర కాంతిలో సముపసితమై వుంది. జగత్తు అంతా అప్పుడు అగ్నిషోమాత్మకమైన సంధికాలంలో పశ్చిమం అగ్నిదీప్తంగా, పూర్వభాగం ఉత్పలవర్ణసంగా విరాజిల్లుతున్నది. వ్యోమతలం అఖిలమున్నూ కించిత్తామ్రరాగరాజులమై, నక్షత్రసమృద్ధమై, దివ్యసౌవరమూర్తిగా తేజరిల్లుతున్న ఘోషంలో అన్ని ఇండ్లు బంధువులతోకూడినగృహములతో కలకలాడుతున్నాయి. అట్టి పుణ్యసమయంలో అక్రూరునిరథం వ్రజంలో ప్రవేశించింది. ఆ రథంలో అక్రూరుడు దేవతలమాతనుపోలి ప్రకాశించాడు.

దూరంగా నందుని ఘోషం కన్పిస్తున్నది. ఆ ఘోష మధ్యంలో అనంతసహాయుడై వున్న ఆదిదేవుణ్ణిపోలి శ్రీకృష్ణదేవుడు అవిభిన్న భావుడైన బలదేవసహాయుడై, అక్రూరుని నయనాధ్వంలో ఒదిగి కన్పించాడు. ఆ దేవుణ్ణి అట్లా చూడగా అక్రూరుని అంతరంగం హర్ష తరంగతరంగితం అయిపోయింది. అపాంగం బాష్పధారా పరిప్లుతమైపోయింది. అంగం పులకపరికలితం అయిపోయింది. విశ్వ వరదుడు, సర్వేశ్వరుడు అయిన మహానుభావుడు, తనకండ్లయెదుట లీలామానుషవిగ్రహుడై సాక్షాత్కరిస్తున్నాడు. త్రైలోక్య మోహనమై సనవయౌవనంతో తొంగిచూడుతున్న ఆమూర్తిని చూడగా అక్రూరునికి మోహం పుట్టుకవచ్చింది. విచిత్రభంగులుగా నటించిన ఆ మహామూర్తియొక్క బాల్యక్రీడ సర్వమున్నూ అతని మనస్సులో వృక్షశాఖాగ్రాన్ని పోలి ప్రదూరగవిజ్ఞాన మాధుర్యాలను తలపించింది. లీలగా కాళియునిపై నర్తించి, విస్ఫురిస్తున్న లావాయలోన్నగా, ప్రేమం వచ్చి ఒక్కటిసిరించి వర్షపుట్టింతగా, గోపుత్రులు గల...

...వుతూ, ఈ మూర్తి గోకులంలో ఎందరి హృదయాలను రంజిల్లచేయలేదు! ఎందరు ఆ శైశవక్రీడామాధుర్యాలకు చిక్కి, కుమార కృష్ణుణ్ణి అక్కునకు అదుముకొని, చొక్కిపోలేదు! ఈ ఆలోచనతో అక్రూరుని మనస్సులో ఒక విచిత్రమైన సంశయం పొటమరించింది. ఇప్పుడు నేను ఏమి చెయ్యాలి? శ్రీకృష్ణస్వామిని ఏ విధంగా పలకరించాలి? "అయ్యా! శ్రీకృష్ణ! ఇట్లారా!" అంటూ పోయి కౌగలించుకుంటానా! అట్లాకాక! కమలనాభ! ఆదిపురుష! సర్వేశ్వరా!" అంటూ ప్రణామం ఆచరిస్తానా? ఇందులో ఏది నేను చేస్తాను?

అక్రూరుని ఆలోచనలు ఎటూ తెగడం లేదు. శ్రీకృష్ణుని మూర్తిని చూస్తూవుంటే, అసలు ఆలోచన అనేదే తోచడంలేదు. ఆ రూపాన్ని దర్శిస్తూవుంటే తనలో తనకే ఏదో తెలియని విచిత్రమైన అనుభూతికల్గుతున్నది. చూపులునిర్నిమేషాలుఅవుతున్నాయి. మనస్సు శ్రీకృష్ణదేవుని సుందరావతారమునందే లగ్నం అయిపోతున్నది. ఈ ఆకారం ఏమి ఆకారం! సుందరాలలో సుందరము, మధురాలలో మధురము అయిన ఆకారం! ఆ వదనం ఏమి వదనం! అది గోపికానయన చకోరపూర్ణేందువు; మధురమైన వాగ్వైభవం కలది. ఆ వక్షం ఏమి వక్షం! అది లక్ష్మీసనాథోగలాలితం; శ్రీవత్సలక్షణం కలది. ఆ భుజములు ఏమి భుజములు? అవి దైత్య నిర్మథన దుర్దాంత దివ్యాయుధ ధారణార్హములు; అతి ఆయతములు. ఆ చరణద్వయం ఏమి చరణద్వయం? అది త్రైలోక్యనిత్య శరణ్యం; రక్తాంగుళీకం. ఈ మూర్తి ఇతనియందు కాక ఇంకా ఎచ్చటన్నా అమరుతుందా? ఘనశ్యామసమవర్ణుడు; సువర్ణవర్ణవాసుడు; కౌస్తుభోద్దీర్ణహారుడు; అచ్యుతుడు; సర్వదేవతాభ్యర్చితుడు; ఇతడు కాక ఎవ్వరు ఇంతటి లోకాతీతమైన సౌందర్యంచేత లోకాన్ని ఆనందగంగాజలాల్లో అభిమర్షణాలు ఆడించగలుగుతారు!

ఆ అందాన్ని చూస్తూ అక్రూరుడు రథాన్ని దిగి నందుని అంగణంలో ప్రవేశించాడు. ద్వారసమీపంలో కొన్ని గోవులనుకట్టి పాలు తీస్తున్నారు. గోవత్సాలను దూరంగా కట్టారు. ఆ వత్సాలమధ్య శ్రీకృష్ణదేవుడు వత్సమైన గోవృషాన్ని పోలి సముపస్థితుడై వున్నాడు. ఆ కృష్ణుణ్ణి చూడగా అక్రూరుని మనస్సు ఆగలేదు. హర్షంచేత అతని కంఠం గాద్గద్యాన్ని పొందింది. అప్రయత్నంగా అతని నోటివెంట "కేశవ! తాత! దేవకీనందనా!" అన్న మాటలు అస్పష్టమధురంగా వెడలాయి. కృష్ణుణ్ణి అక్కడ ఎవ్వరూ దేవకీనందనా! అని సంబోధించరు. ఆ సంబోధనం ఇవ్వాళే గోకులంలో మొదటిసారి విన్పించింది. అట్లా కృష్ణుణ్ణి సంబోధించింది ఎవ్వరు? సంబోధించి నిర్నిమేషమైన నేత్రాలతో ఆ కృష్ణుని అందాన్ని త్రాగుతున్నది ఎవ్వరు? అక్కడ అంతా అతనివంకే చూచారు. అక్రూరుడు వారిని చూడటంలేదు. కృష్ణునివంకే చూస్తున్నాడు. అక్షరయౌవనుడైన శ్రీకృష్ణదేవుణ్ణి చూస్తున్నాడు. ఆ చూపులో



చిత్రకారుడు: కె. నరసింహారావు (అప్పురుపూడి)



ప్రశాంతవుంది. భక్తి వుంది. ఆర్తి వుంది. ఆ చూపులు పుండరీకాక్షుని మీద స్తిమితాలై నిల్చాయి. సింహాకారయాలవిక్రముణ్ణి పరామర్శించాయి. సంపూర్ణబలసౌభాగ్య శరీరుణ్ణి స్పృశించాయి. పర్వత ప్రవరాకృతిని చూచి అద్భుతంపడినాయి.

అట్లావున్న అతణ్ణి చూచి అప్పుడు ఎవ్వరూ అతణ్ణి పల్కరించలేదు. అతణ్ణి తెలిసినవాళ్ళ అక్కడ అరుదు. ఒక్క నందునికి తెలుసు; రోహిణికి తెలుసు. ఆ ఇద్దరు అప్పుడు అక్కడ లేరు. అదిగూడా అక్రూరునికి ఒక అదృష్టమే అనిపించింది. ఎవరన్నా అప్పుడు అతణ్ణి పల్కరిస్తే, సమాధిభ్రష్టుడైన యోగివలె అతడు ఖేదాన్ని చెందివుండేవాడు. నిర్వేదాన్ని పొందివుండేవాడు. శ్రీ కృష్ణునిమీద చూపులను లోపలిచూపులుగా మలంచిలో కల్పివుండేవాడు కాదు. మలంచికొని శ్రీ కృష్ణదేవుని దివ్యసుందర రూపమాధుర్యమధువును నేత్రములచేత గ్రోలి వుండేవాడు కాదు. లోపలకు మలగిన చూపులతో కలిగిన ఎరుకలో చొక్కి వుండేవాడు గూడా కాదు. ఇతడు నారాయణదేవుడు. చతుర్విధ భూతహితంబు కోరి దేవకీగర్భంబున ఉద్భవించినవాడు. వసుదేవుని ప్రయత్నంచేత చేరిగి, వ్రేపల్లెలో ఉల్లసిత బాల్యయౌవన విజృంభితములయిన వినోదములను క్రమంగా ఆదరించినవాడు. పూర్వం బలిని అడిగి, బలసూదనునకు త్రిలోకాధిపత్యం సమకూర్చినవిధంగా, ఇప్పుడు కంసుణ్ణి కూల్చి, ఉగ్రసేనునకు రాజ్యం ఇచ్చి, తాను రాజుగా నుండనొల్లక అఖిల రాజన్యలోకాన్ని శాసించగలవాడు. ఈవిధమైన ఎరుక అతనికి కలిందంటే అందుకు ఎవరో వచ్చి పల్కరించి, సమాధిభంగం కల్గించకపోవడమే కారణంగాని వేరు కారణం లేదు.

అట్టి స్థితిలోవున్న అక్రూరుణ్ణి చూచి శ్రీ కృష్ణదేవుడు చిరునవ్వులంగా బలదేవుణ్ణి చూచినాడు. ఈయన ఎవ్వరో తెలుసునా అన్న ప్రశ్నలుగా ఆ చూపులు బలదేవుని చూపులను తాకినాయి. ఆ చూపులలో వారికి ఏదో రహస్యం అర్థం అయినట్లు వుంది. అర్థం అయినంతలో బలదేవుడు "అమ్మా!" అని పిలిచినాడు. రోహిణి ఇంటిలోనుండి వచ్చినది. ఆ వెనుక యశోద వచ్చినది. ఆ అక్రూరుణ్ణి చూడగా రోహిణికి సంతోషం కల్గింది. [illegible] వచ్చింది. [illegible] "[illegible]!" అని [illegible]

"అక్రూర!" అని పల్కరించింది. అక్రూరుడు నిద్రలేచినట్లు కన్నులుగా ఆ పల్కరించినది ఎవ్వరా అని చూచాడు. "తల్లీ! రోహిణీ తల్లీ! ఎన్నాళ్ళకు! ఎన్నాళ్ళకు!" అన్నాడు. అంతే. తిరిగి అతనిచూపులు శ్రీ కృష్ణదేవుని పైన ప్రాలినాయి. బలదేవుణ్ణి పరామర్శించినాయి. తాను ఏమిచేస్తున్నది తెలియకుండానే అక్రూరుడు ససంభ్రమగమనంతో గోపాలదేవుణ్ణి దరిసి, ఆదేవుని శ్రీపాదపద్మములకు నిజగోత్ర నామ సముచ్చరణ పూర్వకంగా ప్రణామంచేశాడు. "తండ్రీ! దేవకీనందనా!" అన్నాడు. యశోద విచిత్రమైనచూపులతో వారిని చూచింది. నా తండ్రి దేవకీనందనుడు ఏమిటి అనుకున్నది. అనుకున్నంతలో వెలవెలపోయింది. అప్పుడు యశోదకు ఏదో విషయం అర్థంఅయినట్లు, కానట్లు, విచిత్రమైన అనుభూతి కల్గింది. రోహిణిని చూచి "తల్లీ" అన్నది. రోహిణి "యశోదా" అన్నది. "తల్లీ! నేను ఎవ్వరికను" అని యశోద రోహిణిని ప్రశ్నించింది. "యశోదా! నీవు యశోదవు. తండ్రి యశోదబిడ్డడు. దేవకీనందనుడు కూడాను" అన్నది రోహిణి. నీల వచ్చి యశోదను పట్టుకొన్నది. ఇంటిలోనికి తీసుకుపోయింది.

శ్రీకృష్ణదేవుడు అక్రూరుని ప్రీతితో లేవనెత్తినాడు. ప్రేమతో కౌగలించుకున్నాడు. గౌరవంతో కుశలప్రశ్నలు వేశాడు. అతిప్రూరవక్షుడైన పుండరీకాక్షుని సాక్షాత్పరిరంభణంలో అక్రూరుడు తనశరీరం అవగతదోషం అయినట్లే భావించుకున్నాడు. శ్రీనిర్మథనుని పూజనం అందుకొని ప్రాప్తసుకృతసంగ్రహాగరిష్ఠం అయినదనుకున్నాడు. తన్ను చూచి మాటించిన అధరంలో విగళిత మోహం అయిందనుకున్నాడు. శ్రీ కృష్ణస్పర్శవలన తనదేహం సామర్థ్యమునకు భాజనమైనదని తలంచుకున్నాడు. తన జన్మ కృతప్రయోజనం అయిందనుకున్నాడు.

అంతలో రోహిణి అన్నది. "తండ్రీ! అక్రూరుణ్ణి ఇంట్లోకి తీసుకురండి."

ఆ మాటలు విని శ్రీ కృష్ణుడు బలదేవసహితుడై అక్రూరుణ్ణి అభ్యంతరగృహంలోకి తోడ్కొనిపోయినాడు. యశోద [illegible] చేసింది.

★



టంకల్లు అతను చీకట్లో పాలేరు వెనకాలే నిశ్శబ్దంగా ఏదో ఆలోచనలో నిమగ్నమై ఇంటివైపు నడుస్తున్నాడు.

ఆ పసుళ్ళ దాబామీద చీకటి పడ్డాక పోగొప్పవద్దని ఎన్నిసార్లయ్యగారు చెప్పినా చెవినెట్టుకోకుంటివిదొరా—అని సేవాధర్మాన్ని మర్చిపోకుండా వినయపూర్వకంగా మందలించాడు పెద్దపాలేరు.

వాకిటిగుమ్మంలో వీధికిమధ్యగా లాంత రెత్తి కట్టి చేత్తోపుచ్చుకొని 'ఏరా, వస్తున్నాడా దొరగారు—' అని పెద్దకేక వేశాడు మూర్తి తండ్రి, పెద్ద మోతుబడి రైతు, పెద్ద పార్టీ నాయకుడు, పంచాయితీ బోర్డు ప్రెసిడెంటూ అయిన రఘుపతయ్య గారు.

'ఆ—ఆ—దొరా' అని సమాధానం చెప్పాడు ప్రమత్తతతో పెద్దపాలేరు.

## నందివాడ వెంకట్రామయ్య

వీధి మొగదల్నుండి మలుపు తిరిగి సవారి బండీ వస్తోంటే లాంతరెత్తి చూశాడు రఘుపతయ్య. ఆ చీకట్లో ఎడ్ల మెళ్ళో కంచుగంటల మోత రఘుపతయ్య కర్ణాలను పగలగొడుతున్నట్లు వినవచ్చింది. ఆ గంటల మోతనుబట్టే అనుకున్నాడు — ఎక్స్‌ప్రెస్ నాయకుడు నారాయణ తన ఎడ్లకు పోటీగా కొనుక్కొచ్చిన మైసూరెడ్లని. ఊరుమీద సవాలుకని తయారు మేపుతున్న నారాయణ పెద్దపాలేరు రామదాసు బండి తోలుతున్నాడు. రఘుపతయ్య వీధిలో నుంచోటం చూడగానే రామదాసు మైసూరెడ్ల తోకల మీదకు చేతులు పోనిచ్చి ఆ చీకటి వీధిలో దూకుడుగా సవారి వేయిస్తూ రఘుపతయ్య వాకిటిముందుకు వచ్చేశాడు అప్పుడే—

వీధిలోనుంచి గుమ్మంలోకి వెళ్ళి నిలబడ్డ రఘుపతయ్యను చూస్తూ 'పిచ్చిపిచ్చివేషాలు వేసే పక్క తిరగ్గొడతా—నడు—ఊఁ—' అని అదిలించాడు ఎడ్లను.

బండీ ఎదురువచ్చే రఘుపతయ్య పెద్ద

ధైర్యం తెచ్చుకోటానికి కూడా సమయం లేదు—

రఘుపతయ్య ఇంటి దర్వాజాలు బయట కొట్టే దెబ్బలకి బెసుకుతున్నాయి.

ఈ పర్యాయం 'చిన్నపార్టీ' నాయకుడు నారాయణ గొంతు జబర్దస్తీగా వినబడింది—'రఘుపతీ తలుపు తియ్యి - బయటకి రా - లాభంలేదు బయటకి రా—' అంటూ.

ఎగస్పార్టీవాడైనప్పటికీ మూకనుండి నారాయణ మాట వినపడేసరికి మూర్తికి ధైర్యం వచ్చింది - గబాలున గడియ తీశాడు - అమాంతం 'నారాయణ మావా!' ఇదేమిటన్నట్టు పిచ్చికేక పెట్టాడు. ఆ అరుపులో ఎదురుకుండా జరుగుతున్న అరాచకం వల్ల కలిగిన ఆందోళన, ఆతృత, అసహ్యత పెచ్చుస్థాయిల్లో మిళితమై స్పష్టమౌతున్నాయి మూర్తి గొంతులో—

రఘుపతి ఒక అడుగు వెనుక వేసి ఒక కాలు ముందుపెట్టి బల్లెం గురిపెట్టి నిల్చున్నాడు - నారాయణా జాగ్రత్త - అడుగు ముందుకు వేశావో...

మూర్తి గబాలున గడప అవతలికి వెళ్ళాడు - 'ఆగు మావా - మూకనాపు - మర్యాదగా ఆపు—' అంటూ

రఘుపతి గబాలున గడియ వేసుకున్నాడు.

'మర్యాదగా ఆపాలి? ఆపకపోతే ఏం చేస్తావేం?' అంటూ ముందుకు వస్తున్నాడు నారాయణ.

'మావా!—' బ్రహ్మాండభాండం బద్దలయ్యేటట్లు, దిక్కులు పిక్కటిల్లేటట్లు గుడ్లగుండా నిప్పులు కక్కుతూ అరిచాడు ఇంతకుముందు కోపమంటే తెలియని మూర్తి.

ఆ అరుపు అలనాటి అర్జునుని పాంచజన్యం పిలుపులాగా వుంది పెద్దపార్టీవారికి—ఆ అరుపు చెలరేగే అగ్నిజ్వాలపై నీటితుంపరలు విదిల్చినట్లు తాత్కాలికంగా చెకముకాటు నిస్తబ్ధులై రగిలేకళ్ళతో అందరూ మూర్తివంకే చూస్తున్నారు. ముందు ఒకడు చిన్నదెబ్బ కొడితే తతిమావాళ్ళందరూ ఎవరికివారు మూర్తిని నమిలి మింగేద్దామనుకుంటున్నారు. ప్రతివారూ అంత నిర్మొహమాటంగా ముందుకు వెళ్లి మూర్తి వంటిమీద దెబ్బవేయటానికి తటపటాయిస్తున్నారు. కారణం మూర్తి ప్రతివాళ్ళనూ పలకరిస్తాడు - పార్టీలు వద్దని నచ్చచెబుతాడు - ఎవరికివారు ఒంటరిగా మూర్తి మాట్లాడినప్పుడు మనకీ పార్టీలు యుద్ధం వద్దని తీర్మానించుకున్నవారే.

"మూర్తీ! నువ్వు తప్పుకో - నువ్వు చేసేది మూర్ఖం. ఈ పరిస్థితిలో ఈ మూక నీ చెబితే వినదు. తరువాత తరువాత ఏంజరుగుతుందో చెప్పలేను. మంచిగా చెబుతున్నా. నీ నాన్నని తలుపు తియ్యమను, చెవిటివాడికి అరిచి చెప్పినట్లు చెప్పాడు నారాయణ.

'మావా!' [illegible] అన్నాడు మూర్తి

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి

రోజంతా

# నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!



తిండి తినగానే ఒకసారి తోముకుంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి, దుర్వాసన పోగొడుతుంది.**

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావటం ఆగిపోతుందని, దంత వ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమని, శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది. అంతేకాదు, నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మందికైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది. ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇది ఋజువైనది.

కాల్గేట్‌నుంచి నురనురగమంటూ వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకుపోయి, అక్కడ పళ్ళ పోయి ఉండే ఆహార పదార్థాల కణములను బయటికి గిలా వేస్తుంది. పళ్ళు పాడై పోటానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ కణములే.

కాల్గేట్‌తో పళ్ళు తోముకొవటమంటే పిల్లలకు చాలా సరదా. ఎందుకంటే దానినుంచి వచ్చే చాలా సేపు ఉండే పిప్పరమెంటు వాసనంటే వారు చెవి కోసుకుంటారు.




మీకు పళ్ళపొడి అలవాటైతే కాల్గేట్ పళ్ళపొడివల్లకూడ ఇన్ని లాభాలూ ఉన్నాయి ...... ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది.

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

DCG. 2807 T

# శాంతి నిలయం

తప్పుకో "ఊఁ" అంటూ మూర్తిని తోసి, తలుపుదగ్గరకు వెళ్ళాడు నారాయణ—'రఘుపతీ బయటికి రా' అంటూ.

మూకంతా తోసుకుంటూ నెట్టుకుంటూ తలుపుదగ్గరకు వస్తోంది.

ఇంతలోనే వెనకనుండి బాణాకర్రలు టపటప మోగాయి. పెద్దపార్టీ మనుషులు వత్తుగా నొక్కుకొని గుంపుగావున్న చిన్నపార్టీ మనుషుల్ని ఊపిరి పీల్చుకునేందుకు కూడా వ్యవధి యివ్వకుండా కొడుతున్నారు.

'రఘుపతిరావుగారూ! తలుపు తీసుకురండి. వచ్చాం "మేము" పెద్దగా అరిచాడు పెద్దపార్టీ మనిషి, మిలిటరీనుండి తిరిగివచ్చిన హరినారాయణ.

రఘుపతి తలుపు తీశాడు—చుట్టూ పెద్దపార్టీ, తన మనుషులు—మధ్యలో ఉక్కిరిబిక్కిరిగా ఒకరినొకరు అతుక్కొనివున్న చిన్నపార్టీ వాళ్ళు. కర్రఎత్తి కొడదామంటే వీలులేకుండా వుంది చిన్నపార్టీకి. చుట్టూమూగి పెద్దపార్టీవాళ్ళు కసితీరా తలలు పగలకొడుతున్నారు. చిన్నపార్టీవాళ్ళు దెబ్బతిన్న వాళ్ళు దెబ్బతిన్నట్లుగా కూలిపోతున్నారు.

రఘుపతి జారిపోతున్న నారాయణ్ణిపట్టుకోబోయాడు. నారాయణ గబాలున ముందుకు ఉరికి కత్తి విసిరాడు రఘుపతిమీదకి. ఆ విసురుకి రఘుపతి నుదుటిమీద గాయమై రక్తం కారుతోంది. మూర్తి నారాయణ్ణి పట్టుకునేందుకు పరుగెత్తాడు. అది చూచిన హరినారాయణకూడా వెంబడించాడు నారాయణను.

నారాయణ ఇంటి సింహద్వారం దాటి లోపలికి వెళ్ళి గభాలున వేయబోతున్న తలుపుల్ని మూర్తీ, హరినారాయణా తోసుకొని లోపలికి జొరబడి నారాయణ్ణి చెరొక రెక్క విరిచి వెనక్కి తిప్పి పట్టుకున్నారు. హరినారాయణ పేష్కబ్ తెరిచాడు.

తల చితికిపోయిన రామదాసు 'అమ్మా, దాహం' అంటూ నారాయణ గుమ్మం ముందు స్పృహతప్పి కూలబడ్డాడు. నారాయణభార్య పద్మావతమ్మ రామదాసుకు చెంబుతో నీళ్ళు తీసుకువచ్చింది.

మూర్తి హరినారాయణ చేతుల్లో చిక్కుకొని వున్న భర్తను చూచినా ఆమె కించిత్తయినా తన సహజగాంభీర్య వదనాన్ని మార్చుకోలా—ఆ సంఘటనను చూచి ఆశ్చర్యచకితురాలవ్వలా—కర్తవ్యాన్ని నిర్వర్తించాలన్నట్లు ఆమె రామదాసు ముఖంమీద నీళ్ళుజల్లి చెంబెత్తి నోట్లో దాహం పోసింది.

పేష్కబ్ తెరచిన హరినారాయణకు ఆమె నుదుటన దిద్దుకున్న కుంకుం కొట్టవచ్చినట్లు తోచింది. ఆమె మాంగల్యంమాట జ్ఞాపకమొచ్చింది. కసి దిగమింగి తెరచిన కత్తిని మూశాడు.

మూర్తి నారాయణచెయ్యి వదలి 'అత్తా' అని పలుకరించాడు.

'చెప్పాను నాయనా—వద్దని ఎన్ని విధాలో చెప్పాను—తెలిసి కూడా నీకు కబురు పెట్టటానికి వీలేకపోయింది.'

సుశీల వచ్చి 'మూర్తీ! ఏమిటి ఈ దౌర్జన్యం?' అని పడగవిప్పిన మిన్నాగులాగా పౌరుషాన్ని కక్కుతూ అరచింది హరినారాయణచేతిలో బిగిసిన తండ్రిని చూచి.

నారాయణ ఆమాటని ఆసరాగా తీసుకొని విదలించుకొని, హరినారాయణ చేయి విరచి పట్టిన పట్టునుండి వదలించుకొని లోపలికి వెళ్ళి బల్లెం పట్టుకువచ్చాడు. కానీ పొడవటానికి అతనిలో ఉద్రేకం చచ్చిపోయింది—కనీసం ఒక దెబ్బన్నా, తిట్టన్నా వాళ్ళ చేత తింటేగాని తిరిగి రాదతనికి పొడవదగ్గ వుద్రేకం—

ఇంకా నీ బుద్ధి పోనివ్వలా అన్నట్లు జాలిగా నవ్వి 'మావా...' అన్నాడు అతి శాంతంగా మూర్తి.

అబ్బురు మించిన సుశీల 'చూస్తావేమిటి నాన్నా—' అంది.

నారాయణ మూర్తిని పొడవటానికి బల్లెం ఎత్తి బలంగా ముందుకు గుచ్చాడు. పద్మావతమ్మగారు ఆగండి అంటూ మధ్యకు వెళ్ళింది. మూర్తిని పొడవబోయిన పోటు ఆమెడొక్కలో పొడుచుకుంది. మూర్తి మీదకి బల్లెమెత్తగానే హరినారాయణ, నారాయణమీదకు విసరిన బాకు ఆమె వీపుమీద దిగబడింది. అమ్మా అంటూ సుశీల తల్లిమీద వాలింది. అత్తా అంటూ మూర్తి విస్తుపోయాడు. అమ్మగారూ అంటూ హరినారాయణ పాదాలు పుచ్చుకున్నాడు—నారాయణ నిర్విణ్ణుడై నిలబడిపోయాడు.

పెద్దపార్టీ చిన్నపార్టీని చాలా చితగ్గొట్టి నారాయణ దొరకలేదని, రఘుపతి వారిస్తున్నా వినకుండా దండు దండూ ఇంటిమీదికి వచ్చింది. తలుపులు బార్లా తీసివున్నాయి—నిర్లక్ష్యంగా లోపలికి వెళ్ళింది దండు—

చచ్చిపడివున్న పద్మావతమ్మను చూచి ఏమిటో అర్థంకాక తెల్లబోయి నిలబడిపోయారు. ఒకరిద్దరు పద్మావతమ్మగారూ అంటూ దగ్గరకు వెళ్ళి కన్నీళ్ళు కార్చారు.

నారాయణ ఇంటిమీదపడి ఏం దురంతం చేస్తున్నారో వాళ్ళని, నుదుటినుండి రక్తం కారుతున్నా లెక్కచేయకుండా త్వరత్వరగా వచ్చిన రఘుపతి, నిస్తబ్ధతను చూచి గుంపుగుండా తోసుకుంటూ లోపలికి వెళ్ళాడు.

'అమ్మా! పద్మా! ఇదేమిటమ్మా—ఏమిట్రా? ఏమిటి? ఏం జరిగింది నారాయణా?—' సమాధానం ఎవ్వరూ చెప్పలా. 'పద్మా, పద్మా' అంటూ గావురుమన్నాడు రఘుపతి.

నారాయణ బల్లెం క్రింద పడేసి, పైకెగసి పోతున్న ప్రాణాన్ని బలవంతాన బిగబట్టుకొని అక్కడినుండి కదిలాడు.

ఆరాత్రి ఊళ్ళో ఎవరికీ నిద్దర్లు లేవు. ఈ వార్త విని ఆడవాళ్ళంతా పార్టీ సంగతి మర్చిపోయి పద్మావతమ్మనుచూడటానికివచ్చారు. ఊరంతా నారాయణ యింటిలోనే కిక్కిర్సుకొని ఇమిడిపోయింది. విచార విస్మయాలు ఆకాశమంతా ఆవరించిపోయాయి. మబ్బులు చంద్రుని మసకకాంతిలో తెలతెలబోతూ ఈ వార్తను దేశమంతా చెప్పాలని గుసగుసలు చేసుకుంటూ నడచిపోతున్నాయి. వసంతపు గాలి ఓరుగ వీస్తోంది. ఏరు ఘోష పెడుతోంది. ఎలా తెల్లవారిపోయిందో తెలియకుండా తెల్లవారిపోయింది.

కాకులు చేసే గోలను ఎవ్వరూ వినిపించుకోవటంలా. ఎవరికివారు మొద్దుబారిపోయిన హృదయాలతో మౌనంవహించి శూన్యంలోకి చూస్తున్నారు.

మందంగా పట్టివున్న మంచును ఛేదించుకొని వస్తున్న సూర్యకిరణాలు, శూన్యంలోకి చూస్తున్న వారి గుడ్లల్లో గుచ్చుకొని కళ్ళను చెమ్మగిలుపుతున్నాయి.

తరువాత కార్యక్రమాలు విధిగా జరిగిపోయాయి.

పద్మావతమ్మగారి పెద్దదినం వైభవంగా జరిగిపోయింది.

ఊరంతా కలసి భోజనాలు చేశారు ఆరోజు.

చాలామంది క్రితంరాత్రి పద్మావతమ్మగారు కలలో కనిపించారంటూ ఏమిటేమిటో కథల్లాగా అల్లి చెప్పుకున్నారు. ఎవరికివారు పద్మావతమ్మగారి ఆత్మశాంతికొరకు పార్టీలు విసర్జిస్తామని మనసుల్లో దృఢంగా నిశ్చయించుకొని స్వర్గాన్నుండి ఆ తల్లి తమవంక చూస్తూ ఆశీర్వదిస్తున్నట్లు ఊహించుకుంటూ ఊరిప్రజలందరూ ఏకపంక్తుల్లో భోజనాలు చేశారు.

ఇంతకుముందు వసూలుచేసిన రెండుపార్టీల పార్టీఫండుతో ఆమె జ్ఞాపకార్థం శాంతి నిలయమనే మందిరాన్ని నిర్మించారు ఊరి మధ్యలో.

ఆ మందిరంలోనే మూర్తి సుశీలల వివాహం జరిగింది. 

---

భార్య—అబ్బబ్బ! ఈ సంసారం ఈదడం నాతరంకాదు. అప్పులవాళ్ళు తినేస్తున్నారు.

భర్త—చప్పునవంటచేసేయి! మనంకూడా తినేద్దాం.

—ఎమ్. వి. గోపాలకృష్ణ
(పాలకొండ)




17-8-60 బుధవారం మొదలు

23-8-60 మంగళవారం వరకు.

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీ ఆలోచనలకు ప్రతిబంధకాలు వస్తూ ఉంటవి. కొన్ని విషయాలలో అక్రమమని తెలిసి కూడా ఆచరించవలసిన అవసరం కలుగుతుంది. కలహ సూచనలు కనపించి సమసిపోతవి. బంధువులవల్ల సహాయం లభిస్తుందని ఆశించవద్దు. వృత్తి ఉద్యోగాలలో ప్రశాంతంగా జరుగుతుంది. ప్రస్తుతం కుటుంబంలోని వారితో మృదువుగా వ్యవహరించవలసిన సమయం. ధర్మకార్యాలు జరుగుతవి. విలువగల వస్తువులు కొంటారు. అయితే మోసం జరగకుండా చూచుకొనండి. పశ్చిమదిక్కునుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. తక్కువ అంతస్తులో ఉండేవారివల్ల పనులు నెరవేరుతవి. 22, 23 తేదులలో సుఖభంగం, ఇతరులతో పోటీ, వృథా ప్రసంగాలు.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి, మృగశిర 1, 2 పా.)

కార్యభారం అధికంగా ఉన్నా ఉత్సాహంతో మీ ప్రయత్నాలను సాగించుకుని పోగలుగుతారు. ఆదాయం కూడా బాగుంటుంది. మీ ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. అధికారులవల్ల అనుకూలత కలుగుతుంది. మిమ్ములను గురించి మీ స్నేహితులు అపోహ పడటంవల్ల మనశ్శాంతి లోపిస్తుంది. శుభ సంతోష కార్యాలకై విశేషంగా ధన వ్యయం చేస్తారు. ప్రయాణాలు చేయవలసిన అవసరం కలుగవచ్చు. సాధ్యమైతే నిలుపుకొనటం మంచిది. విశేషంగా డబ్బు పెట్టుబడిపెట్టి చేయు పనులలో తొందర పడవద్దు. 17, 18 తేదులలో ధన లాభం, శుభ లాభ వార్తలు తెలుస్తవి. అధికారులతో పరిచయం.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

పై వేషంచూచి ఎవ్వరినీ నమ్మవద్దు. ఆదాయం పెరుగుతుంది. కాని ఖర్చులు కూడా పెరగటంవల్ల అసంతృప్తిగానే ఉంటుంది. కోపా పెరుగుతుంది. సంఘ కార్యాలలో మీ బాధ్యతలను నెరవేర్చుకోగలుగుతారు. అయితే ప్రతివక్కరిని సంతృప్తి పరచలేకపోతారు. వృత్తి సంబంధించిన కార్యకలాపాలలో పొరపాట్లువచ్చే అవకాశాలున్నవి. కుటుంబంలో ప్రశాంతంగా ఉంటుంది. తలచిన పనులు సకాలంలో నెరవేరుతవి. బంధువు వద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. అనేక విషయాలలో ఇతరులపోటీ తొలగి ఉత్సాహకరంగా ఉంటుంది. 22, 23 లలో వృథా ధన వ్యయం, అకస్మాత్తుగా చిక్కులలో తగుల్కొనే సూచనలు.

**గ్రహస్థితి**

వృషభంలో అంగారకుడు, కర్కాటకంలో బుధుడు, సింహంలో సూర్య శుక్ర రాహువులు, ధనుస్సులో గురు శనులు, కుంభంలో కేతువు, మిథున కర్కాటక సింహాలలో చంద్రుడు.

* * *

**కర్కాటకం**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ప్రస్తుతం ఏ ప్రక్కనుంచి ఎందువల్ల కలహాలు వస్తవో ముందుగా తెలుసుకొనటం కష్టం. జాగ్రత్తగా ఉండండి. ధనం ఎంత వచ్చినా ఖర్చు అవుతూ ఉంటుంది. వ్యవసాయ రంగంలో గౌరవం దక్కించుకోగలుగుతారు. కుటుంబంలోని వారి ఆరోగ్యం బాగుండదు. వృత్తి వ్యాపారాలలో ఇంతకుముందు చేసిన పనులు ఎదురుతిరిగే అవకాశాలున్నవి. సమయంలో బుద్ధి చురుకుగా పనిచేయటంవల్ల నష్టకష్టాలు రాకుండా సరిచేసుకోగలుగుతారు. అయితే పట్టుదలలు పెంచుకోకుండా కార్యసాధనకు ప్రయత్నించటం అవసరం. వారాంతంలో అనారోగ్య సూచనలు కనపిస్తవి. ఆత్మీయులతో కలహాలు రావచ్చు. 18, 19 లలో గొప్పవారితో సమావేశం. విలువగల వస్తువులు కొంటారు. ధర్మకార్య నిర్వహణ.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

అన్నివిధాలా శక్తి సామర్థ్యాలు ఉండి కూడా వినియోగించుకొనటానికి అవకాశం దొరకక అవస్థపడవలసి వస్తుంది. ముందు అపవాదులు వస్తవేమోనన్న భయం అధికమవుతుంది. మోసం చేయటానికి ప్రయత్నించే మనుష్యులు ఉంటారు. కోర్టు కచేరీలలో మీ మాట చెలామణీ అవుతుంది. వృత్తి ఉద్యోగాలలో శ్రమ కనపిస్తున్నా పాటివారివల్ల సహాయం లభిస్తుంది. దేహ శ్రమ అధికం. అనుకున్న ప్రయాణాలు ఆగిపోవచ్చు. కుటుంబంలో ఖర్చులు పెరిగినా సంతృప్తికరమైన ఫలితం కనపిస్తుంది. సాహస కార్యాలయందు ఆసక్తి అధికం; ప్రయోజనం మాత్రం ఉండదు. 17, 18 లలో ధన ప్రాప్తి, శుభకార్యాలలో పాల్గొనటం.

* * *

**కన్య**

(ఉత్తర:2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

ఎవరు ఎన్నిరకాలుగా భావించినా మీకు వచ్చే చిక్కు ఎంతమాత్రం ఉండదు. మీ ధైర్యం మిమ్ములను కాపాడుతుంది. న్యాయంకోసం శ్రమపడగలుగుతారు. మీరు అనుకున్నంతగా ఆదాయం పెరగకపోయినా ఇంతకుముందుకన్నా మేలు అని చెప్పవచ్చు. అనేకమంది మీ సహాయం కోరవచ్చు. మీ శక్తిని చూచుకోకుండా మాట ఇవ్వవద్దు. ఆత్మీయులతో అభిప్రాయభేదాలు వస్తవి. సంఘంలో పేరు ప్రతిష్ఠలు పెరుగుతవి. వృత్తి వ్యాపారాలలో ముందు పొరపాటుచేసి సవరించుకోగలుగుతారు. ఈ వారంలో వచ్చే వార్తలు ప్రయోజనకరంగా ఉండవు. గౌరవంకోసం శ్రమ; ఖర్చులు భరించవలసివస్తుంది. 19, 20 ల్లో అధికారుల పరిచయం. సౌఖ్యలోపం, స్వల్ప ధనలాభం.

* * *

### తులా:

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ప్రతిష్ఠకోసం ప్రాకులాడవలసిన సమయం. మీవల్ల సహాయం పొందినవారు మిమ్మల్ని హేళన చేయటానికి ప్రారంభిస్తారు. కొన్ని సమయాలలో ఆదాయం కంటె ఖర్చులు పెరిగిపోతవి. వృత్తిలో ఫలితంలేని పనులు అధికమవుతవి. మీ బుద్ధిబలంతో స్నేహితులవల్ల కార్యం సాధించుకోగలుగుతారు. ఎవ్వరి మనస్సునకు బాధ లేకుండా చూచుకోనటం అవసరం. అధికారులవల్ల అనుకూలమైన సమయం. చిన్న చిన్న ప్రయాణాలు చేయవలసి వస్తుంది. మీ ధర్మస్వభావాన్ని అవతలివారు సరిగా అర్థం చేసుకోనకపోవటంవల్ల మనస్సుకు బాధ కలుగుతుంది. వ్యవహారరంగంలో ఖర్చులు, శ్రమ అధికం. 22, 23 లలో వృత్తిలో శ్రమ, కార్యభంగం, అపకీర్తి భయం.

* * *

### వృశ్చికం:

(విశాఖ 4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

గ్రహబలం బాగున్నది. మీ ఆలోచనలు ఎప్పటికప్పుడు నెరవేరి ఫలితం పొందగలుగుతారు. ఇంతకుముందు ఉన్నటువంటి కలహసూచనలు క్రమంగా తొలగిపోతవి. అన్ని విధాలా సమర్థులైన పెద్దమనుష్యులతో స్నేహం లభిస్తుంది. వృత్తి ఉద్యోగాలలో మీకు మోసం చేయాలనే వారు ఉంటారు. కాని వారి ప్రయత్నాలు ఆరంభంలోనే విఫలం అవుతవి. బంధుమిత్రుల కార్యకలాపాలలో జోక్యం కలిగించుకోవలసిన అవసరం కలుగుతుంది. స్థిరాస్తులు కొనటం, విశేషంగా ధనం పెట్టుబడి పెట్టి చేయు వ్యాపారం మొదలయినవాటికి అనుకూలమైన సమయం. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. పుణ్యకార్యాల యందు ఆసక్తి కలుగుతుంది. 18, 19, 20 తేదులలో శుభ, లాభవార్తలు, విలాస కార్యాలకై ఖర్చు.

* * *

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

మీ జాగ్రత్తవల్ల అన్ని పనులు నెరవేరుతవి. శత్రుబాధ తొలగుతుంది. మొదట కొంచెం శ్రమ తోచినా నలుగురూ మీ మాటను అనుసరించి వస్తారు. ఉద్యోగవృత్తులలో ఆదాయం మామూలుగానే ఉంటుంది. కాని గౌరవం మాత్రం పెరుగుతుంది. బంధువులవద్ద నుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం కొంచెం నిదానంగా లభిస్తుంది. ఓర్పు వహించటం అవసరం. వారం మధ్యలో మీకు సంబంధం లేని ఖర్చులు మైన పడుతవి. హాస్య ప్రసంగాలు ముదిరి చిక్కులకు దారి తీయకుండా చూచుకోనండి. పండితులతో పరిచయం లభిస్తుంది. వ్యవహార విషయాలలో మీకుగల సందేహాలు తొలగిపోతవి. 22, 23 లలో ధన, వసునష్టం, పనులలో ఆటంకాలు, అధిక శ్రమ.

### —ఈవారము ధరలు:—

బంగారు ధర 21, 22 తేదులలో తేజీ, వెండిధరలో 18, 19 తేదులు మందీ.

పసుపుధర వారం మొదటి భాగంలో తగ్గి రెండవ భాగంలో పెరుగుతుంది. వేరుశనగపప్పు, నూనెధరలు 17, 18 లలో కొద్దిమందీ, తిరిగి పెరుగుదల, నూవుల ధర తేజీలో నిలకడ, గోధుమల ధర 19 వరకు తేజీ, మరల మందీ, మినుములు, శనగల ధర కొద్దిగా తగ్గవచ్చు.

మిర్చిధర పెరిగి అకస్మాత్తుగా తగ్గే సూచనలున్నవి.

* * *

### మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

క్రమక్రమంగా పరిస్థితులు అనుకూలిస్తవి. ఆరంభించిన పనులు నిరాటంకంగా జరుగుతవి. కోర్టు కచేరీలలోను ఆలస్యం కనిపిస్తుంది. కాని, అందువల్ల ప్రయోజనం ఉంటుంది. బంధువుల వద్దనుంచి శుభవార్తలతోపాటు కష్టవార్తలునూ తెలియటంవల్ల ఉత్సాహం లోపిస్తుంది. ఇతరులకు మీరు చెప్పిన మాటను సకాలంలో కాపాడుకోగలుగుతారు. ఈ సమయంలో ఇతరుల సలహాలను ఏ విషయంలో ఎంతవరకు ఉపయోగించుకోనటం అనే యోచన అవసరం. కుటుంబంలో ఖర్చులు పెరుగుతవి. ప్రత్యేకంగా అనారోగ్యం చేయదు కాని, దేహశ్రమ అధికంగా ఉంటుంది. 21, 22 లలో పోటీవారితో అభిప్రాయభేదాలు, వృథా శ్రమ, త్రిప్పట అధికం.

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఇతరులతో కలసి ఏపని చేదామని తలపెట్టినా ప్రతిబంధకాలు వస్తూ ఉంటవి. అపవాదులను ఓర్పుతో ఎదుర్కోన గలుగుతారు. వృత్తిలో అభివృద్ధికరమైన కాలం. ఆదాయంకూడా పెరిగే అవకాశాలున్నవి. అయితే సాహసం పనికిరాదు. కుటుంబంలోనివారి సుఖసౌఖ్యాలు లోపించటంవల్ల మీ కార్యక్రమాలు చురుకుగా సాగవు. వారం రెండవ భాగంలో ఎదురుచూడని ఖర్చులు వచ్చిపడుతవి. అందితే జుట్టు, అందకపోతే కాళ్లు పట్టుకోనే రకం మనుష్యులు తటస్థపడతారు. మాటలతోనే జాగ్రత్తగా తప్పించుకోనండి. లోగడ మీరు చేసిన కృషి ఫలిస్తుంది. 17, 18 తేదులలో సంఘకార్యాలు, బంధుమిత్రులలో గౌరవం.

* * *

### మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

మోసగించే వారిని మోసంతోనే జయించగలుగుతారు. కొన్ని సందర్భాలలో అనుకున్నంత సులభంగా పనులు నెరవేరవు. కాని సహనం అవసరం. మీ మాటను తిరస్కరించిన మనుష్యులే మిమ్మల్ని అనుసరిస్తారు. ప్రయాణ సూచన లున్నవి. ముఖ్యులతో విరోధం రాగల అవకాశాలున్నవి. ముందుగా ఎవ్వరికీ వాగ్దానాలు చేయటం మంచిది కాదు. వృత్తి ఉద్యోగాలలో మీ బాధ్యతలను సక్రమంగా నెరవేర్చుకుంటారు. అయితే మానసికంగా ఆదుర్దాతోనూ ఉంటుంది. ధన సంబంధమైన ఖర్చు బాధ్యతలు తలవని తలంపుగా వచ్చిపడుతవి. బంధువులు తమలో తాము కలహించుకుని మిమ్మల్ని ఇబ్బంది పెట్టవచ్చు. 22, 23 లలో అనారోగ్య భయం. పొరపాట్లు చేయటం.

-దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

డెబ్బది ఏళ్ల అనుభవపు ఫలితము... అత్యంత సౌమ్యమైన

# జాన్సన్స్ తయారులు

చిన్న పిల్లల విషయములో సాటిలేని అనుభవమువలన పిల్లల చర్మ రక్షణకైన ప్రతి రకపు వస్తువునూ జాన్సన్స్‌వారు మాత్రమే తయారుచేస్తున్నారు!

సౌమ్యమైన మరియు తెల్లని జాన్సన్స్ బేబీ సోప... ప్రపంచములోకెల్ల అత్యంత శ్రేష్ఠమైన టాల్కునుండి తయారుచేయబడే జాన్సన్స్ బేబీ పౌడర్... చంటి పిల్లల లేత చర్మమునకు అతి జాగ్రత్తయైన సంరక్షణ పూర్తి అగునట్లు జాన్సన్స్ బేబీ క్రీమ్ మరియు బేబీ అయిల్.

జాన్సన్ అండ్ జాన్సన్ ఆఫ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్





# వనితాలోకం

## మహిళలు - ఉద్యమాలు

ఈనాటి తెలుగు పత్రికా ప్రపంచంలో కలిగిన పెద్దమార్పేమిటో ఒకవాక్యంలో చెప్పాలంటే, ఆడవాళ్ళు విరివిగా ఈ రంగంలోకి ప్రవేశించడమేనని చెప్పొచ్చు. ఇంచుమించు అన్ని పత్రికల్లోను యీ రోజు స్త్రీలకోసం ప్రత్యేక శీర్షికలు, ప్రత్యేక వ్యాసాలు ప్రచురించడం జరుగుతోంది. యింతేగాకుండా మిగిలిన శీర్షికల్లోకూడ స్త్రీలు ఎక్కువగా ప్రవేశించేస్తున్నారు. ఏవో ఒకరిద్దరికోసం కాకుండా మొత్తం స్త్రీలకందరికీ సమానంగా వ్యాసరచనలో ప్రోత్సాహం కల్పిస్తున్న 'పత్రిక' కృషి హర్షణీయం. రకరకాల వ్యాసాలు యీ శీర్షికక్రింద ప్రచురిస్తున్నారు. ఇందులో చాలావరకు సంఘంలో స్త్రీ స్థానాన్ని బాగుపర్చడానికి ఉద్దేశింపబడుతున్నాయి; మిగిలినవి ఏవో తాత్కాలిక సమస్యలకి విశ్లేషింపబడుతున్నాయి.

స్త్రీల సమస్యలగురించి స్త్రీలే చెప్పాలో చాలా-అన్న ప్రశ్న ఒక ప్రఖ్యాత రచయిత్రి వినక ఒకబహిరంగసభలో మాట్లాడుతూ వ్యక్తంచేశారు. దానిఅంతరార్థం చాలాదూరం వెళ్తుంది. కాలేజీల్లో, యితరసంస్థల యాజమాన్యాన జరుగుతున్న వార్షికోత్సవాల లాంటి సభల్లో, మహిళా సమస్యలపైన ఉపన్యసించడానికి, స్త్రీలనే పిలవడం గురించి మాట్లాడుతూ ఆమె "సమాజంలో తనగురించి స్త్రీ 'స్వంతడబ్బా' తనే వాయించుకోవలసిరావడం చాలా శోచనీయం" అన్నారు. ఆ పరిస్థితి సంఘంలో ఏర్పడినప్పుడు, స్త్రీలంతా ఒక పీడిత జాతి క్రింద తలచబడుతున్నారన్నమాట! మరో జాతికి వ్యతిరేకంగా స్త్రీ తనహక్కులకోసం పోరాడవలసి వస్తోందన్నమాట! స్థూలంగా చూస్తే యిది నిజమే అనిపించినప్పటికీ, వాస్తవికంగా స్త్రీ అంత నికృష్టపు బ్రతుకు బ్రతకడంలేదు. ఆమాటకొస్తే స్త్రీసమస్యల్ని బాగా అర్థంచేసుకుని, వ్యక్తంచేయగలవారు స్త్రీలలోకన్న పురుషులలోనే ఎక్కువ ఉన్నారు. సరిగ్గా యిదేవిషయాన్ని ఆనాడు రచయిత్రి మనస్సులో పెట్టుకుని ఆమాట అన్నారు. అయితే యీ విషయంలో మనం అంతగా ముందుకు వెళ్తున్నట్టులేదు. మహిళా సమస్యలపైన చర్చించడానికి మహిళలనుంచే వ్యాసాలుకి పత్రికలు కోరుతున్నాయి; సభావేదికలపైన మహిళలే తమ 'గోడు' వెళ్ళబోసుకుంటున్నారు!

### డి. సీతా హైమవతి

ఈ పరిస్థితి యిలా ఉండగా వ్యాసాల్లో, ఉపన్యాసాల్లో బహుళంగా ప్రచారంలోకి వస్తున్న స్త్రీలు కొన్ని కృత్రిమ సమస్యల్ని మాత్రమే దృష్టిలో ఉంచుకుని, వాస్తవాన్ని నిర్లక్ష్యం చేస్తున్నారనే అభిప్రాయం కలగజేస్తున్నారు. ఎవరిమటుకువారు ఒకకోణంలో సమస్యని పరిశీలించి, 'యిది యింతే'నని సర్వసాధారణం చేసేస్తున్నారు. ముసలివాళ్ళు చాదస్తులనీ, రైళ్ళలోనూ యితరచోట్ల పడుచుపిల్లల్ని పెళ్ళిగురించీ సంతానంగురించీ అడ్డమైన ప్రశ్నలూ వేసి పరిపిస్తారనీ, యిలా ఏమేమో కాలేజిలో చదువుకుంటున్న అమ్మాయిలు, అంతకు క్రిందివయస్సువాళ్ళు విమర్శిస్తూంటారు. అత్తగార్ల "తాచ్చిప్పయుగాన్ని" యీ "స్వతంత్రయుగపు" కోడళ్లు దుయ్యబట్టుతున్నారు. అలాగే నడివయస్సువాళ్ళు, అంతకుపైవాళ్ళు, యీనాటి కుర్రపిల్లల "హిప్పీ చెప్పీ"లో, యితర "పోకిరి చేష్టల్నో" అసహ్యించుకుంటున్నారు. అన్నిటికన్నా చిత్రమేమంటే యీ దొక "[illegible]" (తరకలహం) స్థాయికి దిగిపోయి ముప్పై-నలభైయేళ్ళ వయస్సుకి అటుఉన్నవాళ్ళంతా ఒకపక్షం, అంతకు యిటు ఉన్నవాళ్ళంతా మరోపక్షంక్రింద విడిపోయి జ్ఞానపరంపరలు ఒకరిమీద ఒకరు విసురుకోడం. పైగా ఒకసంకుచిత పరిధిలో తమకి కనబడ్డ ఏఒకటిరెండు 'కేసు'ల్నో పట్టుకొని, మిగతాఅంతా కూడా యింతేనని సోదాహరణగా ఋజువు చేయబోవడం కూడా జరుగుతోంది. తటస్థంగాఉండి, యీ 'గాలిలో సాము'వంటిదీ చూస్తున్నవాళ్ళకి "ఏనుగు—అయిదుగురు గుడ్డివాళ్ళు" కథ జ్ఞాపకం వస్తుంది.

రెండుపక్షాలవాళ్లు ఒకపరమ సత్యాన్ని విస్మరిస్తున్నారు. కాలం తెచ్చేమార్పు ఒకటి ఉంటుందన్న విషయం స్మృతిలో ఉంచుకున్నట్టు కనబడదు. చుట్టూ ఉన్న సంఘం, సాంఘిక పరిస్థితులు, అవసరాలు, మనుష్యులు, జంతువులు, పరిసరాలు-అన్నీ విపరీతమైన వేగంతో మారిపోతున్నాయి. యాభై, అరవై ఏళ్ళక్రితం ప్రపంచంలో మానవుడి పరిస్థితికీ, యీనాటి మానవుడి పరిస్థితికీ యోజనాల దూరంఉంది. అప్పుడు పడుకున్న కుంభకర్ణుడెవడైనా యిప్పుడులేస్తే యిది ఏలోకమో తెలియని అయోమయంలో పడిపోతాడు. "నిత్యంచావు, నిత్యంపుట్టుక—యిదే జీవిత విధానం" అన్నాడు మార్క్స్. మనలోనూ, బయటా ఎప్పుడూ ఏదోఒకటి చస్తూనే ఉంటుంది, మరొక్రొత్తది పుట్టుతూనే ఉంటుంది. యీనాడు ముదివయస్సులో ఉన్నవాళ్లు ఒకనాడు తామూ కుర్రవాళ్లమే అన్న విషయం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. తమ బామ్మలో, అమ్మమ్మలో తమనీ, తమ 'నాగరికతని' అచ్చంగా యీలాగే విమర్శించేవారని మర్చిపోగూడదు. ఒకనాటి 'కొప్పు'ల్లోంచి యీనాటి జాలుజడల్లోకి పిగ-చుట్లలోకి ఫ్యాషన్ మారింది. అటువంటప్పుడు తమ అమ్మాయిలో కోడళ్ళో రెండుజడలు వేసుకొన్నారని విమర్శించడం దేనికి? యీ క్రొత్తతరంవారి పోకడల్ని విమర్శిస్తున్నవారితీరుచూస్తే, తమతరం వెళ్ళిపోతోందనే చిన్నబాధ, ఒకరకం అసూయ వ్యక్తపరుస్తున్నట్టు ఉంటుంది. అలాగే యీ క్రొత్తతరం వారిలో, తామూ ఒకనాటికి మామ్మలూ, అమ్మమ్మలూ అవకతప్పదనే ఆలోచన ఉన్నట్టు కనబడదు. వీరంతా, రేపు తమపిల్లలు క్రొత్త పెట్టించుకుంటే విరుచుకుపడతారు బహుశా! అత్తగారు తానొకనాడు కోడలే నన్న విషయం ఎలా మరువకూడదో అలాగే

# మహిళలు-ఉద్యమాలు

కోడలూ తనొకనాటికి అత్తఅవుతుందన్న విషయం గుర్తులో పెట్టుకోవాలి. బహుశా తనకీ తనకోడలు చేతిల్లో ఇలాంటి తిప్పలే ఉన్నాయని అనుకోవడం మంచిది. రెండు తరాలవారూ — వెళ్ళిపోతున్నదీ, జరుగుతున్నదీ — యీ ప్రాథమికసూత్రాన్ని గుర్తులో పెట్టుకోనినాడు, ఇదొక చిన్న ఫార్సుగా తయారౌతుంది. వచ్చేతరంవారు వీళ్ళిద్దర్నీ కలిపి "బఫూన్ల" క్రింద జమకడతారు.

స్త్రీలలో స్త్రీలే జరుపుకుంటున్న యీ 'అంతర్యుద్ధం' సంగతలావుంచి, మగజాతి అనే 'భయంకర శత్రువు'పైన కొందరు జరుపుతున్న 'శీతలయుద్ధం' సంగతి పరిశీలిస్తే ఇంతకన్నా తమాషాగా ఉంటుంది. చాలమంది స్త్రీలు తమ 'పురుషుడు' (భర్త) ఒక్కడిలో నేలోపాలులేవనీ, ప్రక్కింటామె భర్తలో అన్నీ లోపాలేనని అనుకుంటూ వ్రాస్తూంటారు. ఇది ఒకందుకు మంచిదే గాని, చాలాదూరంపోతే వెలంవెర్రిగా తయారవుతుంది. ఎదుటింటి కాపురంలో లోగుట్టుమనకిపూర్తిగా తెలియదనే విషయం మర్చిపోయి, వాళ్ళింటి చూరులోంచి దారి తప్పి వచ్చిన ఏ రెండు మూడు విసురు మాటల్నో లేక ఆఇంటామె కోపావేశంలో చెప్పిన ఏ విషయాల్నో ఆధారంగా తీసుకుని, యీ మగాడన్నవాడు కట్టిక్రూరుడు, దుర్మార్గుడు, దుష్టుడు అనివ్రాసిన సోదరీమణులుకూడా ఉన్నారు. అంతటితో తమాషా అయిపోలేదు. ఎదుటి మగవాడిని విమర్శిస్తూనే, తమయింట్లో ఉన్నవాడిని గురించిన కొన్ని ప్రశంసన్నివేశాలని తమలో అపుకోలేక, సందర్భంవున్నా లేకపోయినా వ్రాసేస్తుంటారు! ఇదంతా కాసేపు చదివి నవ్వుకోడానికి బాగానే ఉంటుంది, కాని కొంచెం ఆలోచిస్తే బాధకలుగుతుంది, ఆ అజ్ఞానానికి.

ఇదిలావుండగా మరికొంతమంది ఉడుకురక్తం నాళాల్లో పొంగుతున్న లేతవయస్సువాళ్ళు కొన్ని నినాదాల్ని (స్లోగన్స్) ఇంటాబయటా అప్పజెప్పుతూంటారు. మహిళా సంఘాల ఫాన్సీడ్రెస్ పోటీల్లో, కాలేజీ చర్చావేదికలపైని ఈమాదిరి నినాదాలు వినడానికి బాగుంటాయిగాని లోతుగా ఆలోచిస్తే ఎంతటి అసహజమైన, అనర్థకమైన 'మాటల పొందు'లు ఇవేగాని మరోటి ఉండవు! "స్త్రీ పిల్లలుకనే యంత్రమా?" అనే ప్రశ్నార్థకం కొందరు మొహానమోసుకు తిరుగుతూంటారు. వీళ్లలో ఎక్కువగా పెళ్లిగాని పిల్లలే ఉండడం గమనీయాంశం.

మానవుడే ఒకయంత్ర మనుకుంటే, పురుషుడు డబ్బుగడించే యంత్రం, స్త్రీ పిల్లలు కనే యంత్రం అనుకోవటంలో తప్పులేదు. పిల్లలుకనడమనేది సృష్టి విధించిన ధర్మం. అందులో అభిమానపడాల్సినంత అవమానమేమీ లేదు. ప్రధానమంత్రిణీ అయినా, అధ్యక్షురాలయినా చివరికి పిల్లలు కనక తప్పదుగదా! తప్పించుకోవాలంటే, యీ సృష్టినంతనీ జరిపిస్తున్నవాడెవడో తెలిస్తే వాడికి, ఈమాదిరి స్త్రీలంతా ఏ తాత్కార్యం తాత్కాలికంగానైనా పురుషుడికి విధించమని మహజరు ఒకటి పంపించుకోడం తప్పించి వేరేగత్యంతరంలేదు! దాంపత్యజీవితంలో ఏ ఒకరూ స్వతంత్రులు కారు, కాలేరు. ఎవరిరంగాల్లో వారు, వారిధర్మాల్ని నిర్వర్తించడం తప్పనిసరి. ఒకరు మరొకరి రంగంలోకి ప్రవేశించబూనటం సాంఘికంగా ఒక అస్వస్థత (సోషియల్ ఇమ్‌బాలెన్స్)ని కల్పించి, తద్వారా లెక్కలేనన్ని అనర్థాలకి దారితీయడమే అవుతుంది.

"స్త్రీ బానిసా?" అనే మరో పడికట్టు మాటొకటుంది. దానర్థం, స్త్రీ మగవాడి చెప్పుచేతల్లో ఎందుకుండాలని? నిజంగా పురుషుడు, తన ఇష్టానుసారం స్త్రీని, ఆమెయిష్టానికి వ్యతిరేకంగా ఉపయోగించుకోడం జరుగుతూంటే, అది నిజంగా శోచనీయమైన పరిస్థితే. ఆపరిస్థితి సాధ్యమైనంత త్వరలో నివారణగావడం అవసరం.

ప్రకృతిలో రకరకాల విభిన్నశక్తులున్నాయి. ఈ విభిన్నశక్తుల్లో చాలావరకు పరస్పర వ్యతిరేకశక్తులు. ఈవ్యతిరేకశక్తుల్లో కొన్ని బలమైనవి, మరికొన్ని బలహీనమైనవి. అయితే బలమైనశక్తులు అవకాశం చిక్కినప్పుడల్లా తమ అధిక్యతని, ఇతర శక్తులపైన నెలకొల్పినప్పటికీ, ప్రకృతిలో వున్న మరొక ఉత్కృష్టమయిన శక్తి మూలంగా ఎప్పటికప్పుడు ఒకవ్యవస్థ, సమానత్వం (బేలన్స్) ఏర్పడుతుబడుతూనేవుంది. కొన్ని కృత్రిమశక్తుల్ని మానవుడుకల్పించి ఈ ప్రకృతిశక్తిని ప్రతిఘటించబూనినపుడు ఈ వ్యవస్థకి భంగంవాటిల్లి, అనర్థాలుజరగడం అనేది మనకి బాగా తెలిసినవిషయమే. పాశ్చాత్యదేశాల్లో ఇందుకు ఉదాహరణలు కొల్లలు. అందుకే ప్రకృతిలో ఏశక్తికూడా నిరుపయోగంగా ఉండిపోవడంలేదు. నిరుపయోగకరంగా ఉన్నవాటిని నిర్మూలించడం కూడా జరిగింది. కోట్లకొలది సంవత్సరాల పూర్వం భూగోళంమీద తిరిగిన జంతువులకిన్నీ ఈనాటి జంతువులకిన్నీ-మానవుడితో




సహ-ఉన్న తేడాయే అందుకు కారణం.

ప్రకృతిలో స్త్రీపురుషులనేవి రెండు విరుద్ధశక్తులు గాకపోయినా, విభిన్నశక్తులు. ఇవి రెండూ ఒకటిపైన ఒకటి ఆధిక్యత చెలాయించి, 'పరస్పరాహరణోద్యోగం' కానిస్తే మిగిలేది శూన్యం. ఇరువురి లక్షణాలు, అన్ని విషయాల్లోనూ భిన్నమైనప్పుడు సంఘర్షణకి తావీయడం జరిగిందంటే, అది వాళ్ళ అవివేకానికి చిహ్నం. అలాంటివి వాటంతటవే వినాశనమౌతూంటాయి. అందుకేనేమో, ఇన్ని హత్యలు, ఆత్మహత్యలు సంసారాల్లో! స్త్రీముఖ్యంగా 'హృదయం' గలది. అంటే, ఆమెలో ఎక్కువగా ఫీలవడమనేది ఉంటుంది. ఒక మనిషి బాధపడుతున్నదంటే స్త్రీ చూపే జాలి, సానుభూతి, దయ అపారం. ఆ మనిషికి సేవజేయడంలో దాని పాత్రస్వభావాన్ని దుష్టత్వాన్ని ఆమె జ్ఞప్తికి తెచ్చుకోదు. ఎక్కువగా తనకెదుట చూసినదాన్ని, విన్నదాన్ని ఇట్టే నమ్ముతుంది. అందుకే ఒకోసారి చపలత్వం. చంచలత్వంకూడా ఆమె కంటగట్టబడ్డాయి. ప్రపంచ ప్రఖ్యాతనాటక కారుడు "ఫ్రెయిల్టీ, దై నేమ్ ఈజ్ ఉమన్" అన్నాడంటే యీ లక్షణాన్ని దృష్టిలో పెట్టుకునే అనుంటాడు. స్త్రీకున్న యీ స్వభావంలో ఆమె స్వతంత్రంగా జీవితంలో నెగ్గుకురావడం కష్టం. ఎప్పుడయితే ఇన్స్టింక్టివ్‌గా మనం పనులుచేయడం మొదలెడతామో అప్పుడు ప్రళయాంతకమైన సంఘటనలకి తప్పనిసరిగా దారితీసినవాళ్ల మవుతాం. ఈ ప్రపంచంలో బ్రతకడానికి కావలసింది, విశాలమైన హృదయం కాదు, తీక్షమైన మేధస్సు. అందుకే పురుషుడనేవాడు మరొకడు కలిస్తేనే గాని స్త్రీ పరిపూర్ణ గాదన్నారు. సాధారణంగా పురుషుల్లో యీరకం ఆలోచనాశక్తి ఎక్కువగా కలవాళ్లున్నారు. కొన్నిచోట్ల అటుదిటూ, యిటుదటూ అయితే అయుండవచ్చు. అంతమాత్రాన అందరూ అంతేగాదు. కాబట్టి జీవితం జయవంతం గావాలంటే, యీరకం హృదయం మేధస్సుల సమన్వయం కుదరాలి. ప్రకృతిలోని అత్యుత్తమమైన సమన్వయమిది. ఇది సరిగా జరగనిచోట్ల విధ్వంసమే మిగిలింది. కాబట్టి స్త్రీ పురుష సంబంధంలో ఎవరు ఎక్కువ, ఎవరు తక్కువ అనే చర్చనాపి, ఎవరి పరిధులు వారు గుర్తించుకోడం అవసరం. యీనాటి అత్యాధునిక దేశాల్లో, సంఘాల్లో కూడ స్త్రీ యెక్కువగా నర్సు, స్టెనో, సేల్స్ వుమన్, సెక్రెటరీ, లాంటి ఉద్యోగాలనే స్వీకరిస్తోందంటే, అది ప్రకృతిసిద్ధంగా, మనం అంగీకరించాలి. అయితే స్త్రీలంతా యిలా ఉండాలి, పురుషులంతా యిలా ఉండాలి అని గీతగీసి కేటాయించడం కూడా అవివేకమే. మానవ స్వభావం సరళరేఖలో నడవదు. కొందరు స్త్రీలలోనూ, పురుషుల్లోనూ కూడా రేఖతప్పి నడిచేవారుంటారు. కాని స్థూలంగా ఆలోచించినప్పుడు, సాంసారిక జీవితాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు పురుషుడి ముందుచూపు, ఆలోచన సహాయంతో





## టేబుల్ క్లాత్ మూలలకు డిజైను

కుమారి కె. లేటి మనోరంజితం (మదనపల్లె)

# మహిళలు ఉద్యమాలు

స్త్రీ వెళ్ళడం అవసరం. అందుకే పెద్దలేమన్నారంటే, సుఖప్రదమైన దాంపత్యజీవనానికి కావలసింది ప్రేమ, దాని సంబంధించిన యితర 'సరంజామా' కాదు; ఉండాల్సింది స్నేహం. ఇద్దరు సన్నిహిత స్నేహితుల్లో తప్పనిసరిగా ఒకరు చెప్పిన మాట మరొకరు వింటారు. సాధారణంగా ఆ యిద్దరిలో ఎవరు ఎక్కువ మానసికంగా బలవంతులో వారి యిష్టం నెగ్గుతూంటుంది. సరిగ్గా అదే సంబంధం స్త్రీ పురుషు లిరువురి మధ్య కూడా ఉండాలి; ఉంటుందికూడా చాలచోట్ల. యిది కానిసత్యంకాదు, "వలన విధానం" కాదు!

ఈ మాదిరి కల్పిత సమస్యల్ని మాత్రమే ఆలోచిస్తూ అసలు సమస్యల్ని వెనక్కి నెట్టుతున్నారు, మనలో చాలమంది. మొట్టమొదటిది! స్త్రీలలో స్త్రీలకే, సాంఘిక దృక్పథంలో మార్పురావడం అవసరం. పెద్దవాళ్ళని చిన్నవాళ్లు, చిన్నవాళ్ళని పెద్దవాళ్లు — యీ పరస్పర విమర్శనాపాటవంలో ప్రజ్ఞ చూపడం మాని, ఒకర్నొకరు అర్థం చేసుకోడంలో ముందంజవేయడం అవసరం. రెండు! సంఘంలో ఒక ప్రత్యేక కక్ష్యగా అంతకంతకు సంకుచితమైపోవడం కన్న, పురుషులతో కలిసిమెలిసి సాంఘికంగా ముందడుగు వేయడం నేర్చుకోవాలి.

ఇక్కడ, సర్వసాధారణంగా జరుగుతున్న ఒక విషయం ప్రస్తావించుకోవచ్చు. ఒక వూరిలో నలుగురు చదువున్నవాళ్లో, బాగా డబ్బున్నవాళ్లో ఒకచోట చేరి 'మహిళా సంఘ'మని బోర్డు పెట్టుకోడం; తీరికవున్న సమయాల్లో అక్కడలేని వారిని తిట్టడంతోనో, ఊళ్లోవారిని విమర్శించడంతోనో కాలం గడిపేయడం, వెళ్లిపోవడం జరుగుతోంది. [స్త్రీల విమర్శల్లో పురుషులకన్నా స్త్రీలే ఎక్కువ స్థానమాక్రమించుకోడం గుర్తుంచుకోవాల్సిన విషయం.] యింకా కొంతముంది లేతవయస్సు వాళ్లెవరైనా చేరితే ఏవో ఆటలు ఆడడం కూడా జరగవచ్చు. అయితే యిలాంటి 'సంఘాలు', పుట్టలోనే సంధి కొట్టినట్టు ఎలా వచ్చాయో అలాగే పోతున్నాయి. దానికి ముఖ్యమైన కారణం ఒక కృత్రిమమైన ప్రత్యేకతని యివి కల్పించుకోబూనడమే. పైగా, మహిళా సంఘాల్లో చేరే మహిళలు వివిధంగానూ, సంఘంలోని సామాన్యస్త్రీకి ప్రతినిధులు గాక ఏవో కొన్ని ప్రత్యేక పరిస్థితులకి వారసులు గావడం కూడా ఇందుకు కారణం. మూడో విషయం! యీ సంఘాల్లో కొన్ని కొన్ని చోట్ల అధ్యక్షులు, కార్యదర్శులు లాంటి వారు ఎన్నికోబడడంకూడా జరుగుతోంది. ఈ 'ఎన్నికలు' నామమాత్రాలు. జిల్లా కేంద్రంలో వున్న సంఘానికి జిల్లా కలెక్టరు భార్య, రాజధాని సంఘానికి గవర్నరు భార్య లేక ముఖ్యమంత్రి భార్య తప్పనిసరిగా అధ్యక్షత గహించేయడం మామూలు. అభివృద్ధికోసం పాటుపడే యీ స్త్రీలుకూడా భర్తల హోదాలబట్టి భార్యల అధిక్యతల్ని కొలవడం గర్హనీయం. యిదే విషయాన్ని సాంఘిక సంక్షేమ సంఘాల విషయంలో భారత ప్రభుత్వం నియమించిన కమిటీ విమర్శించింది. స్త్రీలలో స్త్రీలకి సరైన దృక్పథం ఉంటే కట్నాల సమస్య ఏనాడో పోయుండేది. వీధుల్లో ఆడపిల్లలకి జరుగుతూన్న అత్యాచారాలు కూడ అణిగియుండేవి. యిందుకు ఋజువు, విదేశాల్లోని సాంఘిక పరిస్థితులే. విదేశాల్లో మహిళా సంఘాలున్నట్టు; ఉన్నా, యింత విచిత్రంగా నడుచుకుంటున్నట్టు, మనకి తెలియదు.

ఇంట్లో భార్యా, భర్తా ఎలాగైతే కలిసిమెలిసి ఉంటారో, అలాగే బయటకూడా ప్రతి స్త్రీ పురుషుడూ ఒకర్నొకరు అర్థం చేసుకుని కుటుంబంలాగే ఉండడం అవసరం. అలాగాకుండా మహిళా సంఘాలూ, పురుషసంఘాలూ ఏర్పరచుకొని, యిదొక వెనుకబడిన జాతుల ఉద్ధరణ మాదిరిగానో, లేక వలసరాజ్యాల స్వాతంత్ర్యం పోరాటంగానో భావించి ఉద్యమాలు లేవదీయబూనడం హాస్యాస్పదం. ఇవి అనవసరమైనవి. కాబట్టి నాటంతటవే తప్పనిసరిగా నశిస్తాయి. అయితే, అభివృద్ధి చెందిన సంఘానికి లక్షణం, ప్రకృతి చేయబోయే పనికి సాధ్యమైనంత త్వరగా, తేలికగా జరగడానికి అవకాశం యీయడం. అందుకే యిప్పటికన్నా మనం వాస్తవాన్ని గుర్తులోకి తెచ్చుకొని, ఊహాలోకాల్లో విహారం అపుచేయడం అవసరం. 

# వనితా వాణి



## ఉన్నమాట

"మూఢనమ్మకాలకు మూలవిరాటులు" అనే అపప్రథ అతివలకు తొలగాలి" అన్న సుగూరు వాణిగారు వ్రాసిన వ్యాసం నాకు ఏమీ నచ్చలేదు. "పూజలు, పునస్కారాలు చేసేవారు స్వార్థపరులే"నని వ్రాశారు. వీరు ఎందుకని అలాగే వ్రాశారు. వీరి ఉద్దేశ్యములో ఇప్పుడు పూజలనందుకొనే దేవుళ్లందరూ ఎందుకూ పనికిరానివారనేగా! ఇక్కడే వీరు చాలా పొరపాటు చేశారు. తిరుపతి వెంకటేశ్వర్లు, కంచి కామాక్షి, మధుర మీనాక్షి, కాశి విశాలాక్షి, బెజవాడ కనకదుర్గ, సోమనాథదేవాలయము మొదలైన దేవుళ్ళ ఆలయాలలో వుండే విగ్రహాలు ఎందుకూ పనికిరానివారని ఈ వ్యాసం వలన తెలుస్తోంది. ఏ దేవుడి సంగతి ఎలా ఉన్నా తిరుపతిదేవుని ఇంతవరకు అన్నవారు ఎవ్వరూ లేరు. ప్రత్యక్షంగా నిదర్శనాలు కనిపిస్తున్నాయికూడాను. విద్య (సరస్వతి) డబ్బు (లక్ష్మి) ఈ రెండింటినికూడా వీరు లెక్కచేయరా? ఈ వ్యాసంవలన పండుగలు చేయకూడదనికూడ తెలుస్తుంది. మరి పండుగలు, వ్రతాలు దేవుళ్లకొఱకేగా. వాణిగారు ఈలాంటి వ్యాసాలకంటే స్త్రీలకు వంటా వార్పుల్లో ఉపయోగపడే వ్యాసాలు వ్రాయడం మంచిది. తాటిఆకుతో బుట్టలు, చాపలు అల్లే విధానం ఏ సోదరి, సోదరులకు తెలిసినా వ్రాయవలసిందిగా కోరుచున్నాను.

కె. కృష్ణవేణి,
అల్లూరు.

* * *

మూఢనమ్మకాలు మూలవిరాట్టులుగురించి వ్రాసిన వాణిగారు భగవద్భక్తి పేరిట అనన్యంగా కాలం నడిపి చివరకు అల్లాఒకడని, ఢంకాకొట్టి జ్యోతిషమే అసత్యమని, కొట్టిపారవేసి, వీరేశలింగంపంతులుగారి ఆదర్శాలకు జోహారొనర్చి ఈ అభ్యుదయకాలములో స్త్రీలు వంటింటి కుందేలుగానున్నా రనిపమ్మి, చకోరికలె కాలము ఎపుడొస్తుందాయని నిరీక్షిస్తున్నారు.

శాంతి! శాంతి!

కె గాలా పొరపాటు. దైవచింతలేని వ్యక్తి, కములో అరుదు; అందులో మగువలకు మరి ఎక్కువ భక్తి. కాలంతోపాటు మనుష్యులుకూడా మారుచున్నారు. కాని ఏదో కొంచెం పూర్వాచారాలు అంటిపెట్టుకొన్నాయి. దానిని మీ నాస్తికత్వము నేడు గొడ్డలితో మొదలంట నరుకు భావ్యమా!

సి. కె. లక్ష్మి,
నెల్లూరు.

* * *

## నైతికభావం

27-7-60 పత్రికలో సుగూరువాణిగారు వ్రాసిన వ్యాసం చదివాను. వారి అభిప్రాయాలతో నేను ఏకీభవించలేకపోయాను.

ఇక అసలు విషయానికొద్దాము. మొదలుపెట్టిన విషయం సంగతి మరచిపోయి చివరికి పురుషపుంగవులపై విరుచుకుపడినట్లనిపించిందినాకు. అదీకాక వీరు చెప్పేది మరీ ఘోరంగా ఉంది. ఆచారసంప్రదాయాలను దురాచారాలన్నారు. ఎవరు మాటినా అదేమాట. అసలు మంచి ఆచారాలంటూ ఉన్నాయా లేదో ఈ సంప్రదాయం పేరిట ఎన్ని పేదకాపురాలలో చితికిపోతున్నాయని, మనదేశంలో దరిద్రం ప్రబలిపోవటానికి ముఖ్యాతికభాగం దురలవాట్లే కారణం అంటే అతిశయోక్తి ఏమాత్రం కాదని వ్రాశారు. ఇంకొ నయం- స్త్రీలు పెట్టుకొనే అలంకరణలన్నీ దురాచారాలని, వాటివల్ల దరిద్రం ప్రబలిపోతుందనలేదు. దరిద్రం అనేది భగవంతుని పూజించుటవల్ల కుటుంబ సంప్రదాయాలవల్ల కలుగుతుందనటం శుద్ధపొరపాటు. పూజలూ పునస్కారాలకి ఖర్చు ఎక్కువవుతుందన్నారు. భగవంతుని కేదైనా అర్పించవలెననే భావనేఉంటే తప్పకవలోనైనా మాటచెప్పవచ్చు. పత్రం, పుష్పం, ఫలం, తోయం అన్నారు. పుట్టింటికొచ్చి తిరిగి వెళ్ళిపోయే ఆడపడుచుకు సంప్రదాయప్రకారం పసుపుకుంకుమతో ఒక చీరయిస్తే ఆ కుటుంబం దరిద్రదేవత ఒడిలో నిద్రిస్తుందా? శుభమైనవాటిని అశుభంగా అర్థం చేసికొన్నారు.

ఎవరో సంతానం కావాలని మొక్కుకుంటే వారికి పిల్లలు కలుగలేదని తత్కారణంగా దేవుడనేవాడే లేడనడం సబబుగాదు. కలియుగదైవమైన తిరుపతివెంకటేశ్వర్లు ఆపదమొక్కులవాడని అంటారు. అడిగిన వరములొయిస్తాడుగదా అని ఎవరో ఒకావిడ ఎనభైఏళ్ళ వృద్ధుని బతికిస్తే కొండకొస్తానని మొక్కుకుందిట ఆ వృద్ధు బతకలేదు. ఆవిడ దేవుడు లేడనే నిర్ణయానికి వచ్చింది. అలా ఉంది వీరు చెప్పటమూను. తప్పుచేస్తూ దేవుడిని పూజిస్తే ఆ పాపం పోతుందనేవారెందరు లేరు!

పూజలు పునస్కారాలు చేసేవాళ్ళందరూ స్వార్థపరులన్నారు. కోరికతో చేస్తున్నారని తప్పుగా చెప్పారు. కోరికలు తీర్చుకోవటం క్రిందమెట్టు. ఆధ్యాత్మికమైనదానికొఱకు ప్రయత్నించటం పైమెట్టు. మానవుడు క్రిందమెట్టెక్కకుండా పైమెట్టెలా ఎక్కటం? సంసార తాపత్రయాలను వదలి అడవులలో కందమూలములను భుజించి తపస్సుచేసిన మునిపుంగవులు కోరేది మోక్షమార్గం. అదీ కోరికేగదా. కోరిక లేకుండా ఏ మానవుడూ ఉండడు. మనిషిని మించిన దేవుడు లేడన్నారు. కానీ ఏదో దేవుడనేవాడు సృష్టికర్త ఉన్నాడని నమ్ముతున్నారనుకుంటాను.

ఇక జగమంతా భగవంతుడి సృష్టి అయితే కుంటే రోజులలో కొన్ని శుభప్రదమైనవిగాను మరికొన్ని అశుభంగానూ ఎందుకుంటాయి అని వ్రాశారు. ముహూర్తాలు, శుభగడియలూ ఎందుకన్నారు. ఏమండీ ఒక విషయం అడుగుతాను చెప్తే అనుకోండి. ఒకే దంపతులకి ఒకే ఆకారముగల పిల్లలు పుట్టటంలేదు; మంచి చెడు, కష్టం సుఖం, లేదు గొప్ప ఇంటా బయటా ఉంటుంది. అందరూ అందలం ఎక్కితే మోసేవారెవరు? దైవపూజ మూఢనమ్మకమన్నారు. చంద్రమండలంలో అడుగుపెట్టబోతున్న తరుణంలో తమ చుట్టూ ఉన్న అజ్ఞానాంధకారాన్ని విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నం చెయ్యాలన్నారు. దైవపూజ మొదలైనవి అజ్ఞానాంధకారాన్ని కలుగజేస్తాయండీ? మనం కాఫీ తాగినంతలేదు భగవంతుని కొకనారికేళమర్పించటం. నాస్తికవాదం పనికిరాదు.

ఎండ ఉంటేగాని నీడసుఖం తెలీదు. కష్టపడితేగాని సుఖపడటం తెలీదు. ఆపదల్లో

గాని భగవంతుడు కూడ దిగిరాడు. ఇప్పుడు కాక పోయినా ఎప్పటికైనా ఈ ఉద్దేశాన్ని రచయిత్రి మార్చుకొనే తరుణం రాకమానదు. ఒక సలహా – తిరుపతి నిదర్శనాలు చదవండి.

ఎస్. రాధిక, మచిలీపట్నం.

* * *

## బాగుంది

27-7-60 సచిత్రవారపత్రికలో ప్రకటించిన 'మూఢనమ్మకాలకు మూలవిరాటులు' అనే అపప్రథ అతివలకు తొలగాలి" వ్యాసం చాలా బాగుంది.

ఈ 20 వ శతాబ్దంలోగూడా మూఢనమ్మకాలు పెట్టుకొని ఎదుటివారిని బాధపెట్టి, వారు బాధపడే అతివలు అనేకులు యిప్పటికీ వున్నారు.

ఉండుర్తి రేణుక,
విశాఖపట్నం.

* * *

## సరళమాట

శ్రీమతి సరళగారు వ్రాసిన "నేటి పెళ్ళి చూపులు" వ్యాసము చాల బాగుంది. ప్రస్తుత మహిళా సమాజములోని లోటుపాట్లను చక్కగా విపులపరచి విద్యావతులయిన యువతుల పద్ధతులను విమర్శించారు. పెళ్ళి చూపులలో శుభం, సుఖం రెంతో గలదని నేను శ్రీమతి సరళగారితో ఏకీభవించుచున్నాను. ఆమెకు నా కృతజ్ఞత.

ముందుముందునకు ఇటువంటి యుత్తమ వ్యాసములను ప్రచురించెదరని విశ్వసిస్తున్నాను."

మిథిలా రాఘవన్,
బెంగుళూరు.

* * *

## సలహా నచ్చింది

సిద్ధాంతరీత్యా ఎంత చక్కని ఆదర్శమైనా, ఈనాటి మగపిల్లల్లో తగినంత సభ్యతా, సంస్కారమూ పెంపొందేటంత వరకూ సహవిద్య ఆచరణయోగ్యం కాదనే సరళ గారి అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. ప్రస్తుత పరిస్థితుల్లో స్త్రీలకు ప్రత్యేకంగా విద్యాలయాల్ని నెలకొల్పటం కన్న మరో గత్యంతరం కన్పించటంలేదు. మహిళలకు కావలసిన సౌకర్యాల్ని వీలైనంత ఎక్కువగా కల్పించటానికి ప్రభుత్వంతోపాటు ఉదారబుద్ధిగల వ్యక్తులు గూడా మరింత కృషి చేయాలి. ఒకదేశ సంస్కృతిని తెల్సుకోటానికి ఆదేశంలో స్త్రీలకు లభించే మర్యాదామన్ననల్ని అర్థం చేసుకుంటే చాలని మన యువకులు గ్రహించినప్పుడే యువతులు వారితో కలిసి ఒకేచోట విద్య నభ్యసించటం సమంజసం, శ్రేయస్కరం అవుతుంది.

"సత్య ప్రియ"
గుంటూరు.

* * *

# వనితా వాణి

## సరళ సరళి

"పెళ్లి చూపుల" సలహాను దారుణంగా విమర్శిస్తున్న విద్యాధికులయిన యువతీ మణులకు 8-8-60 పత్రికలో సరళ గారిచ్చిన సమాధానం చక్కగా, నిశితంగా, ప్రతి స్త్రీలోనూ చైతన్యం కల్గించేదిగ వుంది.

విద్యావంతులయిన యువతులకి ముచ్చటగ మూడు ప్రశ్నలు సూటిగా వేశారు. వాటికి 'అవును' అన్న సమాధానం సరళ గారికి అక్కరలేకపోయినా అలా సమాధానం చెప్పేవారు చాలా అరుదు.

'తప్పయితే ఉపసంహరించుకుంటాను' అన్నారు సరళగారు ఎంత నమ్రత! ఎంత సరళ స్వభావం! ఇచ్చిన సలహాని, వారు యే నాటికి వుపసంహరించుకోనక్కరలేదు. సరళగారూ! దయచేసి ఆపని చేయకండి. ఈ విషయంలో మీతో ఏకీభవించే అవివాహితులైన యువతులూ, యువకులూ కూడా చాలా మంది వున్నారు.

చక్రవర్తి పి. యస్. అరవింద,
అనంతపురం.

* * *

## డై 'లాగూ చొక్కా'

"వనితల మనస్తత్వాలు" వ్రాసిన భాగ్యలత గారు పాతసంగతులకే 'మీరే చూడండి, మీరే చెప్పండి, మీరే ఆలోచించండి" అనే కొత్త 'డై' లాగూ చొక్కాలు' తొడిగారు. ఆమె చెప్పినట్లు చూడలేకా ఆమె చెప్పిన సంగతులు వినలేకా చెవులూ, కళ్ళూ తిరుగుబాటుచేసాయి. ఇహ మనస్సు ఆలోచించలేక చిరిగిపోయింది. అయినా ఆమె అంత నిక్కచ్చిగా మాటిమాటికీ మీరే చూడండీ, మీరే చెప్పండీ అంటే ఇంకా ఏం చెప్తాం 'చెప్పండి'.

అన్నపూర్ణ,
విల్లివాకం

---

## పాకశాల

# బొంబాయి లక్డీ

బొంబాయిలక్డీ వంటి ఫలహారాలు చేసి, డబ్బాల్లో పోసి ఉంచుకున్నామంటే పదినాళ్లయినా కరకర లాడుతూ రుచిగా ఉంటాయి. అట్టే పెద్ద ఖర్చూ ఉండదు. పిల్లలుగలవారు చేసి ఉంచుకుంటే సాయంత్రాల్లో వాళ్ళనుండి బాధతగ్గుతుంది.

దీని క్కావలసిన వస్తువులు : ఒక పౌను మైదాపిండి. 5 ఫలాల చక్కెర, ½ పౌను డాల్డా, కొద్దిగా సోడా.

మైదాపిండి ముక్కవాసనదికాక, తాజా పిండి తెచ్చి శుభ్రంగాజల్లించి ఉంచుకోవాలి. దీన్ని ఒక వెడల్పాటి పాత్రలోపోసి, నిమ్మకాయంత డాల్డా, 2, 3 చిటికెల సోడా పొడి వేసి బాగా కలపాలి. చక్కెర ఒక గిన్నెలోవేసి, కొద్దిగా నీళ్లుపోసి బాగా కరగించాలి. పిండిలో ఈ చక్కెర నీటిని కొద్ది కొద్దిగా పోస్తూ బాగా కలుపుతూ రావాలి. నీళ్లు చాలకుంటే మరి కొన్ని పొయ్యొచ్చు. ఈ పిండిముద్ద పూరీలపిండి కన్నా గట్టిగా ఉండాలి. ఎందుచేతంటే పిండిలో చక్కెర కలిసేటప్పటికి, పిండి మనం తడిపఉంచినప్పటికన్నా కొద్దిగా పలచబడే అవకాశంఉంది. కాబట్టి మనం ఈ పిండిని కొంచెం గట్టిగానే కలిపి 2, 3 గంటలు మూతబెట్టి బాగా నాననివ్వాలి.

2, 3 గంటలుపోయాక ఈపిండిని రోట్లో వేసిగాని, అప్పడాల పీటమీద వేసిగాని బాగా మర్దనచెయ్యాలి. ఈ మర్దనచెయ్యడం ఎంత ఎక్కువగాచేస్తే బొంబాయిలక్డీ అంత బాగా గుల్లవిచ్చి కరకరలాడుతాయి. ఈ పిండిని చిన్నబత్తాయిలంత సైజు ఉండలుగా చేసి ఉంచుకోవాలి.

అప్పడాలపీటకు, కర్రకు బాగా నూనె రాసి ఈ పిండిని చపాతీలంత మందంతో రొట్టెలాగా వత్తాలి. పదునైన కత్తి తీసుకుని సుమారు అర అంగుళం వెడల్పూ, 1½ అంగుళాల పొడుగులో వీటిని ముక్కలుగా కోసి విడివిడిగా తీసి ఉంచుకోవాలి. ఈలోగా పొయ్యిమీద బాణలిఉంచి డాల్డాపోసి కాగనిచ్చి, ఈ ముక్కల్ని కొద్దికొద్దిగా వేస్తూ దోరగా అనగా ఎరుపు డాలు వచ్చేవరకు వేగనిచ్చి తియ్యాలి. పొయ్యిసెగ తక్కువగా ఉంచాలి. ఇవి బాగా పొంగి, కరకర లాడుతూ రుచిగా ఉంటాయి. నూనెలో కాలిస్తే నూనె వాసన వస్తాయి. డాల్డా వాడితే పదిహేనురోజులైనా బాగుంటాయి. ఇష్టమైనవారు పిండి కలిపేటప్పుడు, డాల్డా కొద్దిగా తగ్గించి కోడిగ్రుడ్డు తెల్లసొన వేసి కలపవచ్చు ఇచ్చిన కొలతలు సుమారుగా ఊహించి ఇచ్చాను. తీపి తక్కువతినేవారు చక్కెర కొంచెం తగ్గించవచ్చు. డాల్డా చాలకపోతే మరి కొంత పొయ్యాలి. అంతే గాని తక్కువైనా దానిలోనే ముగించాలనుకుంటే మాడిపోతాయి. ఇలాగే వీటిని చక్కెరగాకుంటే కొద్దిగా ఉప్పుమాత్రం వేసి చేసుకోవచ్చు తీపి ఇష్టంలేనివారు.

వి. రాజ్యలక్ష్మి జనార్దనం (మద్రాసు)

# సత్యాగ్రహం

పెద్దిభొట్ల సుబ్బరామయ్య



అది నాలుగురోడ్ల కూడలిలోవున్న పెద్ద హోటలు. ఉదయం ఎనిమిదిగంటలు దాటింది. వచ్చేపొయ్యేవారి హడావిడీ జాస్తిగా వుంది. కౌంటరు దగ్గర ఒక బట్టతల వ్యక్తికూర్చుని బిల్లులు వసూలుచేస్తున్నాడు. వేగంగా తిరుగుతున్న టేబుల్ ఫ్యాను పక్కగా కూర్చున్నప్పటికీ ఆ వ్యక్తి నుదుట స్వేదబిందువులు జారుతున్నాయి. కౌంటరు దగ్గర రద్దీ విపరీతంగా వుంది.

ఇన్స్పెక్టరు పార్థసారథి కౌంటరుకు దగ్గర్లోవున్న ఒక కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతున్నాడు. అతని చూపులన్నీ కౌంటరు దగ్గర కూర్చున్న బట్టతలవ్యక్తిమీదనే వున్నాయి. బిల్లులు చూస్తూ, చిల్లరయిస్తూ, తల ఎత్తకుండా యంత్రంలా పనిచేస్తున్న ఆ వ్యక్తిని చూస్తుంటే అతనికి నవ్వువస్తోంది. 'డబ్బు వసూలు చేసుకోవటం కూడా కష్టమైన పనే' అని అతనికి తోచింది.

ఇంతలో హోటల్లోకి వచ్చిన యిద్దరు పిల్లలమీద అతని దృష్టిపడింది. వారిద్దరూ అక్కా తమ్ముళ్ళలా వున్నారు. ఆడపిల్లకు ఎనిమిదేళ్లు వుంటాయి. ఆ పిల్ల వెంటవున్న చిన్నపిల్లవాడికి అయిదేళ్ళు వుంటాయి. ఇద్దరూ, మంచివి కాకపోయినా, శుభ్రమైన దుస్తులు వేసుకుని వున్నారు.

ఆ పిల్ల కౌంటరు దగ్గరికి వెళ్ళి 'మా నాన్నగారు నాలుగు యిడ్లీలు తెమ్మన్నారు' అని చెప్పింది. బట్టతలవాడు బల్లమీద వున్న 'కాలింగ్ బెల్' నొక్కి "సార్" అంటూ వొచ్చిన వెయిటర్ తో "నాలుగు యిడ్లీ పార్శెల్" అని చెప్పి మళ్ళీ తన పనిలో మునిగిపోయాడు. ఆ పిల్లలిద్దరూ అలాగే కౌంటరు పక్కనే నిలబడి వున్నారు.

పార్థసారథి కాఫీతాగటం ముగించాడు. ఆ పిల్లలు అడిగిన పార్శెల్ వొచ్చింది. ఆ పిల్ల పొట్లం అందుకుని కౌంటరుమీదికి చెయ్యిజాపింది బట్టతలవాడు, "ఏమిటి?" అని అడిగాడు. ఆ పిల్ల తడుముకోకుండా,

# సత్యాగ్రహం

"ఇందాక అయిదురూపాయల నోటు యిచ్చాను. మిగిలిన చిల్లర యివ్వలేదు" అన్నది.

పార్థసారథి నివ్వెరపోయాడు. ఆబట్టతల వ్యక్తి మొహంమీద స్వేదబిందువులను పైపంచెతో తుడుచుకుంటూ, సందేహంగా "అయిదు రూపాయల నోటిచ్చావా?" అంటూ సొరుగులాగి నాలుగు రూపాయి నోట్లూ, మూడుపావులా బిళ్ళలూ తీసి బల్లమీద పడేసి మరో బిల్లు అందుకున్నాడు. ఆ పిల్ల నోట్లూ చిల్లరా చేతిలోకి తీసుకుని తమ్ముడి చెయ్యి మరోచేత్తో పట్టుకుని బయలుదేరింది.

పార్థసారథి యింతసేపూ ఆశ్చర్యంతో చూస్తూ వుండిపోయాడు. ఆ పిల్లలిద్దరూ మెట్లుదిగి వీధిలోకి పోగానే అతడు కృతనిశ్చయుడై లేచి బిల్లు చెల్లించి వీధిలోకి వచ్చాడు. ఆ పిల్లలిద్దరూ అప్పుడప్పుడు వెనక్కు తిరిగి చూస్తూ కుడివైపు నడిచి మలుపు తిరుగుతున్నారు. పార్థసారథి మెల్లిగా వారు గమనించకుండా వారి వెంటనే నడవటం ప్రారంభించాడు.

మూడురోజుల క్రిందట పట్టిన ముసురు ఆనాడు తెల్లవారుజామునే వెలిసింది. జలార్ద్రమైన నల్లని మేఘాలు యింకా కమ్ముకుని వస్తున్నాయి. వీధులన్నీ జలమయమై బురదతో నిండివున్నాయి. ఇద్దరు ముగ్గురు పత్రికావాళ్ళు 'పేవ్ మెంటు' మీద నిలబడి దినపత్రిక అమ్ముకుంటున్నారు. ఒకకారు వీధిలో నిలిచివున్న బురదనీళ్ళను, కాలి నడకను పోతున్న వారి మొహాలమీద చల్లి జాడావడిగా పరుగెత్తిపోయింది.

పార్థసారథి చూపులన్నీ ఆపిల్లలమీదే వున్నాయి. వారిద్దరూ త్వరత్వరగా నడిచి ఎన్నో మలుపులు తిరిగి ఒకవీధిలో ఒకయింట్లో ప్రవేశించారు. ఆవీధి అంతా బురదనీళ్ళతో నిండి చాలా అసహ్యంగావుంది. అదివొక చిన్న పెంకుటిల్లు. ఇంటిముందంతా కాలు పెట్టటానికి వీలులేకుండా వాననీళ్ళు నిలిచి వున్నాయి. ఆ నీళ్ళలో నాలుగైదు యిటిక రాళ్ళు వేసి నడిచేందుకు వీలుచేసుకున్నారు. ఇంటిముందుకొద్దిగా ఖాళీస్థలంవుంది. పైకప్పు వంగిపోయి కూలిపోయేందుకు సిద్ధంగావుంది. వాకిటవున్న ఖాళీస్థలంలో ఒకమందారచెట్టు తప్ప మరేమీలేదు. అదికూడా అందరూ తనను నిరాదరించినందువల్ల కాబోలు ఏపుగా పెరగలేదు.

పార్థసారథి ఒకటిరెండు నిముషాలు అలాగే వీధిమధ్యలో ఏంచెయ్యాలో తోచక నిలుచుండిపోయాడు.

ఇంతలో ఆ యింట్లోనుంచి ముందు పెద్దగా నవ్వు వినిపించింది. తరువాత ఒక వ్యక్తి పంచలోకి వొచ్చాడు. అతడు నల్లగా వున్నాడు. కొద్దిగా మాసిన ఒకధోవతి కట్టుకుని బనియను వేసుకునివున్నాడు. గడ్డం ఒత్తుగా పెరిగివుంది. అతడు పార్థసారథివంక రెండుక్షణాలు రెప్పవాల్చకుండా చూసి "ఎవరికోసమండీ?" అని అడిగాడు.

పార్థసారథికి ఏం జవాబుచెప్పాలో తోచలేదు. అతడు నవ్వుతూ సమయస్ఫూర్తితో "ఈ వీధిలో నా స్నేహితుడొకడు వుండాలి. అతనితో పనివుండి వెదుకుతున్నాను. మీరీ యింట్లోకి కొత్తగా వచ్చారా?" అన్నాడు. ఆ వ్యక్తి జుట్టు పైకి సరుదుకుంటూ "అవునండీ. మేమీ యింట్లోకివచ్చి వారంరోజులే అయింది. ఇంతకుపూర్వం యీ యింట్లోవున్న అతనికి బోదకాలు, బ్రహ్మచెముడు. అతనేనా మీ స్నేహితుడు?" అని ప్రశ్నించాడు. పార్థసారథి తలవూపి "నాకెక్కడా యిల్లు దొరక్క బాధపడుతూవుంటే, తను యిల్లు ఖాళీచేసి పోతున్నాననీ, యీ యింట్లో చేరవచ్చుననీ చెప్పాడు. ఇప్పుడేం చెయ్యగలం? అంతా మించిపోయింది. ఇంతకీ మీకీ యిల్లు వసతిగావుందా?" అని అడిగాడు. 'అలా వీధిలోనే నిలబడి మాట్లాడుతున్నారే. లోపలికిరండి' అంటూ ఆ వ్యక్తి ఒక చాపతెచ్చి పంచలోవేసి పార్థసారథి కూర్చున్నతర్వాత తనుకూడా కూర్చుంటూ "ఆc! ఏం వసతిలెండి! నూతినీళ్ళు తాగలేక బాధపడిపోతున్నాం. వర్షానికి ఒకటే కురవటం. యిల్లంతా 'చిత-చిత' లాడుతున్నది." అంటూ చప్పరించాడు. "మీరేం చేస్తున్నారు?" అని పార్థసారథి అడిగినప్రశ్నకు "ఇక్కడే ఒకప్రెస్సులో పని చేస్తున్నానండీ" అని సమాధానం చెప్పాడు.

అదేసమయంలో లోపలినుంచి ఆ పిల్లలిద్దరూ పంచలోకి వచ్చారు. కొత్తడ్రస్సులో వున్న పార్థసారథినిచూసి బిక్కుబిక్కుమంటూ వాళ్ళిద్దరూ గుమ్మంలో నిలుచున్నారు. పార్థసారథి ఆ వ్యక్తిని "మీ పిల్లలా?" అని అడిగాడు. ఆ వ్యక్తి తల వూపి "అవునండీ" అన్నాడు.

పార్థసారథి ఒక్కక్షణం వూరుకుని తర్వాత గంభీరంగా "మీరు అన్యథా భావించనంటే మీతో ఒక విషయం చెప్పదలచుకున్నాను," అన్నాడు. ఆ వ్యక్తి కొద్దిగా ఆశ్చర్యపోయి "అదేమిటి? మీరు నాతో పనివుండే వచ్చారా? మీరు చెప్పదలచుకున్నదేదో సూటిగా చెప్పండి" అన్నాడు.

పార్థసారథి మెల్లిగా జరిగిన విషయం అంతా చెప్పాడు. అతడు మాట్లాడుతున్నంతసేపూ ఆపిల్లలిద్దరూ గుమ్మం వెనక నుంచునే వున్నారు. ముందుగదిలో కిటికీపక్కనయిరవై అయిదేళ్ళ యువతి ఒకామె, ఆపిల్లలతల్లి కాబోలు, వింటూ నిలబడివుంది.

అంతా విన్నతర్వాత ఆ వ్యక్తి కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. అతడు పెద్దగా కేకవేసి పిల్లలను పిలిచాడు. వాళ్ళిద్దరూ సింహంముందుకువచ్చే లేగదూడలవలె పంచలోకివచ్చారు. అతడా పిల్లను జుట్టుపట్టుకుని "నేనిచ్చిన అయిదు రూపాయలనోట్లు ఎక్కడపారేశావు? పారెయ్యటమేగాక హోటలువాళ్ళను మోసంచేస్తావా? నాకు తలవంపులు తెస్తున్నావు. చావు" అంటూ బాదటం ప్రారంభించాడు. ఆపిల్ల వెక్కివెక్కి ఏడుస్తోంది. 'తర్వాత తనను కూడా కొడతాడేమో'నని భయంతో చిన్నపిల్లవాడు 'కెవ్వు'మని ముందే ఏడవటం సాగించాడు.

పార్థసారథి వెంటనే కలుగచేసుకుని ఆ పిల్లను విడదీసి సముదాయించి లోపలికి పంపించి "పిల్లను బాదమని నేను చెప్పలేదు. కొట్టి వాళ్ళను సంస్కరించలేము. మనం తగిన కట్టుదిట్టాలు చేసుకోవాలి. మీకీ విషయం చెప్పి చాలా మనస్తాపం కలిగించినట్టున్నాను. అయినా పిల్లల మంచికోసమే మీకీ విషయం చెప్పాను" అన్నాడు. ఆ వ్యక్తి ఏమీ సమాధానం చెప్పలేదు.

తరువాత కొన్ని క్షణాలు యిద్దరూ నిశ్శబ్దంగా వున్నారు. పార్థసారథికి ముళ్ళమీద కూర్చున్నట్టుగా వుంది. అతడు లేచి "నేను వెళ్ళొస్తానండీ" అన్నాడు. ఆ వ్యక్తి ఏమీ సమాధానం చెప్పకుండా తలవూపి వూరుకున్నాడు. పార్థసారథి మెల్లిగా నడిచి వీధిలోకి వచ్చాడు.

రచయిత—నా కథ 'బాటసారి' మీ పత్రికలో ప్రచురించినందుకు ధన్యవాదాలు.

సంపాదకుడు - క్షమించండి. ఆ కథ పంపినది కుమారి సుధ కాని మీరు కాదే?

రచయిత—మొదట మీరా కథ త్రిప్పి పంపాగా. ఆ తరువాత పేరుమార్చి మళ్ళీపంపాను. 'కుమారి సుధ'ను నేనే.

—అమదాల గంగిరెడ్డి (కొలవపల్లె)

## 2

సాయంకాలం అయిదు గంటలు అయి వుంటుంది. వీధులన్నీ ఆఫీసులనుంచి వచ్చే జనంతో, సినిమాలకు పోయ్యేజనంతో నిండి కిటకిట లాడుతున్నాయి. అప్పుడే అచ్చయి వచ్చిన దినపత్రికను యిద్దరు ముగ్గురు కుర్ర వాళ్లు కేకలువేస్తూ అమ్ముతున్నారు.

పార్థసారథి పార్కుపక్కనే పేవ్‌మెంటు మీద నడుస్తున్నాడు. వారం రోజులనుంచి వర్షం లేకపోవడంవల్ల రోడ్లు కాస్త మెరుగ్గా వున్నాయి. ఆకాశం నిర్మలంగావుంది. చల్లనిగాలి ఆహ్లాదకరంగా వీస్తోంది. పేవ్‌మెంటు మీద అంతవరకూ 'మూకుముక్కలాట' ఆడుతున్నవారిద్దరు ముగ్గురు, పార్థసారథిని చూడగానే పేకముక్కలు దాచేసి ఏదో కబుర్లాడుకుంటున్నవారిలా నటించారు.

పార్థసారథి ఆగిపోయాడు. పార్కులో పిల్లలు రకరకాల ఆటలు ఆడుకుంటున్నారు. ఆపార్కులో పిల్లల కాలక్షేపానికి అవసరమైన సాధనాలు చాలా వున్నాయి. చాలామంది పిల్లలు కేకలువేస్తూ, పరుగులెత్తుతూ ఆడుకుంటున్నారు. ఆపక్కనే సిమెంటు బల్లమీద కూర్చునివున్న యిద్దరు పిల్లలమీద పార్థసారథి దృష్టి నిలిచిపోయింది. వాళ్లిద్దరూ అతనికి బాగా జ్ఞాపకం వున్నారు.

అతడు నెమ్మదిగా నడిచి పార్కులోకి వెళ్ళాడు. 'డ్రస్సు'లో వచ్చిన పార్థసారథిని చూసి కొంతమంది చిన్నపిల్లలు గోల చెయ్యడం తగ్గించి నెమ్మదిగా ఆడుకోవడం ప్రారంభించారు. ఒకనాలుగేళ్ల కుర్రవాడు చక్రాలవంటి కళ్లను మరింత పెద్దవిగాచేసి రెప్పవెయ్యకుండా అతనివంక చూశాడు.

ఆపిల్ల పార్థసారథిని చూసి నవ్వింది. అతడుకూడా నవ్వుతూ, వారిపక్కనే సిమెంటు బల్లమీద కూర్చుంటూ "నేను గుర్తున్నానా?" అన్నాడు. ఆపిల్ల బదులు చెప్పకుండా మళ్ళీ నవ్వింది. ఆ పిల్లవాడు కళ్లు పెద్దవిగా చేసి పార్థసారథివంక చూస్తున్నాడు.

పార్థసారథి కాస్సేపాగి 'నువ్వెన్నో క్లాసు చదువుతున్నావు?" అని అడిగాడు. ఆ పిల్ల నుదుట పడుతున్న జుట్టు వెనక్కు సర్దుకుంటూ 'అయిదు' అని సమాధానం చెప్పింది. ఆకుర్రవాడు చూపుడువేలు చూపిస్తూ "నేను ఒకటి" అన్నాడు. పార్థసారథికి నవ్వాగలేదు.. "అబ్బో! అయితే నువ్వు పెద్దక్లాసే చదువుతున్నావన్నమాట." అన్నాడు.

తరువాత కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుని దూరంగా ఆడుతున్న పిల్లలవంక చూసి "మీరిద్దరూ ఆడుకోవటం లేదెందుకనీ?" అని ప్రశ్నించాడు. ఆపిల్ల తమ్ముణ్ణి దగ్గరికి తీసుకుని "వీడికి నాలుగురోజులనుంచి జ్వరం ఇవ్వాళే తగ్గింది" అని బదులు చెప్పింది.




చిత్రకారుడు: ఎమ్. రామస్వామి (వేలూరు)

"మీ నాన్నగారు ఏ ప్రెస్సులో పని చేస్తున్నారు?" అని అడిగాడు పార్థసారథి. ఆ ప్రశ్న విని ఆపిల్ల ఆశ్చర్యంగా కళ్లు పెద్దవి చేసి చూస్తూ "మా నాన్న ఎప్పుడూ యింట్లోనే వుంటాడు. ఏపని చెయ్యటం లేదు" అని చెప్పింది. పార్థసారథి నివ్వెరపోయి "ఆనాడు ఏదో ప్రెస్సులో పని చేస్తున్నాడని చెప్పావుగా!" అన్నాడు.

ఆ అమ్మాయి ఉదాసీనంగా "మా నాన్న ఏపనీ చెయ్యడు. మునుపొకచోట ఉద్యోగం చేశాడు. కానీ డబ్బు కాజేశాడని వాళ్లు పనిలోకి రావొద్దన్నారు. తర్వాత కొన్నాళ్లు పొద్దునపోయి రాత్రికి యింటికి వొచ్చేవాడు. పేకాట ఆడేవాడని అమ్మచెప్పింది. ఇంట్లో అమ్మను డబ్బుకోసం వేధించి లేదంటే కొడుతూ వుంటాడు. అప్పుడప్పుడు రాత్రి పొద్దుపోయిన తర్వాత తూలుతూ యింటికి వస్తాడు. అప్పుడాయనకళ్లుఎర్రగావుంటాయి. ఏదో వాసనవేస్తూ వుంటుంది. దగ్గరికి పోవటానికే భయం పుడుతుంది. అయినా అమ్మ మాత్రం. కాళ్లుకడిగి అన్నం కలిపిపెట్టి తిని పిస్తూ వుంటుంది. ఇవాళ పొద్దున్నే ఇల్లుగలావిడతో దెబ్బలాడి ఆమెను బండబూతులు తిడితే నలుగురూ చేరి కొట్టబోయినారు అని చెప్పింది.

పార్థసారథి నిశ్చలంగా అంతావిన్నాడు. అతనికి చాలా మనస్తాపం కలిగింది. విషయం మారుద్దామని ఆనాడు నువ్వా హోటలువాణ్ణి మోసంచేశావు. తప్పుకదూ? ఆడబ్బు వాడిది కాదు కదా! ఎవరో జీతంయిస్తే ఆపనిచేస్తున్నాడు. నువ్వలా చెయ్యటంవల్ల వాడి జీతంలో అయిదు రూపాయలు తెగ్గోసివేస్తారు. వాడెంత బాధపడతాడు? ఇంతకీ ఆనాడు నువ్వా అయిదు రూపాయలనోటు ఎక్కడ పారేశావు?" అని అడిగాడు.

ఆపిల్ల ఆశ్చర్యంగా చూస్తూ "ఏనోటు?" అన్నది. పార్థసారథి "మీ నాన్నగారు నీ చేతి కిచ్చారన్నారుగా?" అన్నాడు. ఆ పిల్ల నవ్వుతూ "మీరు భలేవారేనే! మా నాన్న నాకేనాడు ఏనోటూ యివ్వలేదు. ఆయనే అమ్మ వొద్దంటున్నకొద్దీ వినక నాకు అలా చెయ్యమని చెప్పి పంపించాడు" అన్నది.

పార్థసారథి తలతిరిగినట్లయింది. అతడు చాలా అందంగా మోసపోయాడు. కాస్సేపు కళ్ళు తేలవేసి నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

'నమస్కారం సార్' అంటూ ఒక పదేళ్ల కుర్రవాడు, చేతిలో దినపత్రికల దొంతరతో అక్కడికి వచ్చాడు. పార్థసారథి అతన్ని చూసి నవ్వి "ఏమోయ్! నువ్వు కనబడి చాలా రోజులయిందే. రిజల్ట్సు పడ్డనాడు ఫోర్తుఫారం ప్యాసయ్యానని చెప్పటానికి మా యింటికి వొచ్చావు. అప్పటినుంచీ కనిపించనే లేదు. బాగా చదువుకుంటున్నావా?" అని అడిగాడు. ఆ కుర్రవాడు వినయంగా "బాగానే చదువుకుంటున్నానండీ, మీ దయవల్ల యీ యేడు స్కూల్లో స్కాలర్‌షిప్ కూడా వచ్చిందండి. అన్నట్టు కొత్త పుస్తకాలు కొనుక్కోమని మీ యింటికి వచ్చినప్పుడు అమ్మగారు నాకు పదిరూపాయలిచ్చారండి. మీకు చెప్పవద్దని చెప్పారండి." అన్నాడు. ఇంతలో "ఒక పేపరిలా యివ్వవోయ్" అని ఎవరో పిలవడంవల్ల అతడు 'వస్తానండి' అంటూ వెళ్ళిపోయాడు.

పార్థసారథి ఆర్ద్రమైన కళ్ళతో ఆపిల్లనుద్దేశించి "చూశావా? ఈ కుర్రవాడికి తండ్రి చిన్నప్పుడే పోయాడు. తల్లి ధన

# నారద గర్వభంగము

కె. రవిరామచంద్రబోస్

నారదునికి తనని మించిన విష్ణు భక్తుడు లేడని గర్వం కలిగింది. ఒక రోజు నారదుడు విష్ణువుతో మాట్లాడటానికి వైకుంఠం వెళ్ళాడు. శ్రీహరి దగ్గరికి వెళ్ళి భక్త శ్రేష్ఠుడయిన నారదుడు నమస్కరించుచున్నాడు అని నమస్కారం చేశాడు.

అది విని శ్రీహరి "నారదా నీవు నా భక్తుడవు మాత్రమే. శ్రేష్ఠుడవు కావు సుమా" అని అన్నాడు. దానితో నారదునికి కోపంవచ్చి, హరీ నాకంటే శ్రేష్ఠ భక్తుడెవరో చెప్పవలసిందని కోరాడు. విష్ణువు నారదా, భూలోకంలో రామయ్య అనే రైతున్నాడు. అతడు నిన్ను మించిన భక్తుడు అని సమాధానం చెప్పాడు.

నారదుడు హరివద్ద సెలవు తీసుకొని భూలోకానికి వచ్చాడు. అప్పటికే తెల్లవారబోతోంది. రామయ్య నిద్రనుండి లేస్తూనే 'నారాయణ' అని, తరువాత తన పనులన్నీ రాత్రిలోగా పూర్తిచేసుకొని పడుకొనే సమయంలో 'నారాయణ' అని పడుకొన్నాడు. అది చూసి నారదునికి ఒళ్లు మండింది. దానితో కోపంగా విష్ణువు దగ్గరికి వచ్చి "ఏమయ్యా శ్రీహరీ, నీకు మతి ఉందా, లేదా? నిరంతరము నీ నామ




స్మరణ చేసే నేనెక్కడ, రోజుకు రెండు పర్యాయములు "నారాయణ" అనే రైతు ఎక్కడ? అతనా గొప్ప భక్తుడు" అని అడిగాడు.

అప్పుడు విష్ణువు "సరే, అలాగయితే నీకొక పరీక్ష పెడతాను. అందులో కనక నెగ్గితే నీవే శ్రేష్ఠ భక్తుడవని అంగీకరిస్తాను" అని చెప్పాడు. సరే ఆ పరీక్ష ఏమిటో చెప్పండి అన్నాడు నారదుడు. "నేను ఒక గిన్నె నిండా నూనె ఇస్తాను. దానిని ఒక రోజంతా ఒలకపోయకుండా నెత్తిమీద పెట్టుకొని తిరగాలి" అని విష్ణువు చెప్పాడు.

మరునాడు నారదుడు నూనె గిన్నె నెత్తిమీద పెట్టుకొని తిరిగి తిరిగి సాయంకాలం వచ్చాడు శ్రీహరిదగ్గరికి. అప్పుడు శ్రీహరి నారదునితో "నారదా ఈరోజు నా నామ స్మరణ ఎన్నిసార్లు చేశావు?" అని

# నాన్న చెప్పిన మాట

అనగనగా ఒక గ్రామంలో రామయ్య అనే రైతు ఉండేవాడు. అతని భార్య రామమ్మ గుణవంతురాలు. [illegible] వాళ్ళకి రాము, భీము, సోము, శ్యాము అనే నల్గురు కొడుకులున్నారు. వాళ్ళు నల్గురూ కూడా ఒట్టి సోమరిపోతులు. ఇరవై ఏళ్ళు దాటినా వాళ్ళు తండ్రికి వ్యవసాయంలో కాని మరే ఇతర పనుల్లో కాని సహాయపడే వాగు కాదు. అసలు వాళ్ళకి యింటి బాధ్యతే లేనట్లు ప్రవర్తించేవారు. శుభ్రంగా కడుపునిండా తినడం, ఊరంతా తిరగడం వాళ్ళ పని. రామయ్య వ్యవసాయం చేసి తెచ్చిన డబ్బే వాళ్ళ కుటుంబ జీవనాధారం. తన నల్గురు కొడుకుల్లో ఒక్కడు కూడా తన చేతికంద లేదని రామయ్య బాధపడేవాడు. ఇంట్లో పనులు, బయట వ్యవసాయం అంతా రామయ్య ఒక్కడే చూసుకొనేవాడు. భర్త సంపాదనకు తోడుగా పాలు పెరుగు అమ్మివచ్చిన డబ్బుతో పొదుపుగా ఖర్చుపెడుతూ కాలం గడుపుతోంది రామమ్మ. కొడుకుల ప్రవర్తన చూసి భార్యాభర్తలిద్దరూ ఎంతో దుఃఖించేవారు. ఎన్నివిధాలో వాళ్ళకి నచ్చచెప్పి బాగు చెయ్యాలని ప్రయత్నించి

అడవి విజయలక్ష్మి

రామయ్య విఫలం పొందాడు. ఊరంతా కొడుకుల దుష్ప్రవర్తన గురించి చిలవలు పలువలుగా చేసి చెప్పుకొంటూంటే వినలేక రామయ్య ఎంతో విలపించేవాడు. వాళ్ళని ఏ విధంగా బాగుచేయాలో రామయ్యకి తెలియటంలేదు. కొడుకులగురించి బెంగతో కృంగిపోతున్న రామయ్యకు వృద్ధాప్యం దగర కొచ్చింది. వ్యవసాయం చేయలేక పోతున్నాడు.

ఇలాంటి పరిస్థితుల్లో ఉండగా రామయ్యకు ఒకసారి జబ్బు చేసింది. విపరీతమైన జ్వరం నెల్లాళ్ళయినా తగ్గలేదు. తండ్రికి జ్వరమైనా కొడుకులు యింటిపట్టున ఉండలేదు. రామమ్మ ఉపచార్యాలవల్ల ఏమీ లాభంలేక పోయింది. డాక్టరుకు కూడా చూపించుదామంటే రామమ్మ దగ్గర డబ్బులేదు. పరిస్థితుల్ని చూస్తున్న రామయ్యకు బ్రతుకుతానన్న ఆశ పోయింది. "ఈ జబ్బువల్ల తప్పక తాను చనిపోవడం ఖాయం. కాని తాను చనిపోయే ముందు కొడుకుల్ని బాగుచేస్తే తన ఆత్మకి తృప్తిగా ఉంటుంది", అన్న మాట నంయిదే ఆలోచన రామయ్యకు. ఇలా ఆలోచించగా ఆలోచించగా ఒకరోజు రామయ్యకు ఒక మంచి ఉపాయం తోచింది. ఈ దెబ్బతో కొడుకులు తప్పకుండా బాగుపడతారు. అని సంతోషంగా ఊపిరి పీల్చాడు. కాని ఆ రోజునే రామయ్య పరిస్థితి విషమించింది. శ్యాము, రాము, సోము భీము, నల్గురూ తండ్రిపరిస్థితి గమనించి ఆరోజు ఇంట్లోనే ఉన్నారు. రామయ్య కొడుకులు నల్గుర్ని దగ్గరికి పిలిచి కూచోబెట్టుకొని యిలా చెప్పాడు. "నాయనల్లారా! నేను మిమ్మల్ని చిన్నప్పటి నుంచీ ఏ కష్టము తెలియకుండా పెంచాను. చదువు చెప్పిస్తానన్నా మీరు చదువు నేర్చుకోలేదు. నేను మీ మేలు కోరి ఏవిషయం చెప్పినా దాన్ని త్రోసిపుచ్చారు. యిప్పుడు నేను చావుకు సిద్ధంగా ఉన్నాను. కనుక చనిపోయేముందు మీకో ముఖ్య విషయం చెపుతున్నాను, వినండి. నేను మీ నల్గురి మేలుకోరి మీకోసమని నాలుగు పంచెల నిండా డబ్బు మూటగట్టి మన పొలంలో పాతిపెట్టాను. నేను చనిపోయాక మీరు ఆడబ్బు తీసుకొని సుఖంగా ఉండండి. ఇదే నే చెప్పే విషయం. నా ఆఖరి కోర్కె కూడాను" అన్నాడు. తండ్రి మాటలు విన్న వాళ్ళ నల్గురి సంతోషానికి అంతులేదు. "కాని యింకా ముందుకష్టపడనక్కర్లేకుండా తండ్రి తనుకోసం డబ్బు దాచాడు. [illegible] దర్జాగా బ్రతకొచ్చు" అని అనుకొని

## నారద గర్వభంగము

అడిగాడు. నారదుడు "నూనె కింద ఒలకపోకుండా తీసుకొస్తూంటే నిను స్మరణ ఎలా చేయగలను" అని చెప్పాడు. విష్ణువు అన్నాడు గదా "నారదా నీకే ఇవాళ నన్నొకసారి కూడా తలుచలేదు. నీ కంటె అనేక బాధలనుభవించే సామాన్య మానవుడు, అందులోనూ సంసారయాత్ర సాగిస్తూన్న మానవుడు ప్రతిరోజు నన్ను రెండుసార్లు స్మరించుచున్నాడు గదా? అలాంటప్పుడు నాకు శ్రేష్ఠభక్తుడు ఆ మానవుడు అగునా నీవెలా అవుతావు అని అడిగాడు నారదునికి 'నిజమే అవును' అనక తప్పిందికాదు. దానితో నారదునికి శృంగభంగం జరిగింది. ★

# చిట్టి చీమ

ప్రకాశరావు

చిట్టి చీమ కొక్కనాడు
చిత్రమైన కోర్కె కలిగె
గంగాధరు శిరసుపైని
గంగలోన స్నానమాడ.

కోర్కె తీర నుపాయంబు
కోరి తపము కొన్ని నాళ్లు
చేసె చీమ కొక్కనాడు
చిత్రమైన ఊహ కలిగె

అందమైన అడవిమల్లె
నాశ్రయించి చిట్టి చీమ
అందు దూరి కూరుచుండె
ఒద్దికగా, ఓపికతో.

శైవభక్తు డొక్కరుండు
శివునిపూజ కొరకుగాను
అందమైన అడవిమల్లె
గొనిపోయెను భక్తితోడ.

చీమయున్న పూవు శివుని
శిరముపైని చేరగాను
చిట్టిచీమ పైకివచ్చి
స్నానమాడె సంతసమున.

ఆశ్రయంబు మంచిదైన
అన్నికోర్కె లీడేరును
ఆశ్రయంబు చెడుగైన
ఆడిపోయు లోకమంత.

నల్గురూ తండ్రితో "నాన్నగారూ! మీరు పొలంలో డబ్బు నంచులు ఎక్కడ పెట్టారో గుర్తు చెపుతే మేము తీసుకుంటాము. కనుక గుర్తులు చెప్పండ"ని ఎంతో వినయం నటించి అడిగారు. ఈ మాటల కోసమే ఎదురు చూస్తున్న రామయ్య ఒక్కసారి సంతోషంగా

## నాన్న చెప్పినమాట

ఊపిరి పీల్చి కొంచెంసేపు మౌనంగా ఆలోచించి "అబ్బాయిలూ! అవి ఎక్కడ పెట్టానో నాకు సరిగా జ్ఞాపకం రావటం లేదు. అయినా" అని యింకా ఏదో చెప్పబోతోంటే పెద్ద దగ్గుతెరవచ్చి రామయ్య ప్రాణం తీసుకు పోయింది. చెప్పేమాట పూర్తిగా చెప్పకుండా చచ్చిపోయిన తండ్రిని చూసి తమకి డబ్బునంచుల గుర్తులు చెప్పలేదన్న బాధ కొద్దీ కొడుకులు నల్గురూ ఏడ్చారు. రామమ్మ వాళ్ళ పితృప్రేమను గొల్చుకొని దుఃఖిస్తున్నారనుకొంది. ఎలాగో ఒకలాగ ఆరోజు రామయ్య దహనసంస్కారాలు పూర్తి చేశారు వాళ్ళు. ఎప్పుడు పొలానికి పోయి డబ్బు తీసుకుందామా అనే ఆత్రతతో ప్రాణాలు ఉగ్గబట్టుకుని ఆ రోజు గడిపారు. ఆ మర్నాడు ఉదయాన్నే రాము. శ్యాము, భీము, సోము, నల్గురూ గునపాలు, పారలు పట్టుకొని వెళ్ళారు. మధ్యాహ్నం రెండుగంటలయ్యేసరికి పొలం అంతా తవ్వి తవ్వి వదిలిపెట్టారు. ఎక్కడా డబ్బునంచులు దొరక లేదు. ఆకొద్దీ తవ్వి తవ్వి చేతులు నొప్పిపుట్టాయి వాళ్ళకి. ఫలితం శూన్యం. కోపం పట్టలేక నల్గురూ పొలంనుంచి యింటికి వచ్చి సరగా తల్లి దగ్గరికి వెళ్ళారు. "అమ్మా! నాన్నగారు మమ్మల్ని మోసం చేసారు. పొలంలో డబ్బు నంచులు ఉన్నాయంటే ఆకొద్దీ పొలం అంతా తవ్వి తవ్వి వదిలి పెట్టాము. నాల్గునంచులు కాదు కదా! ఒక్కదంటే కూడా లేదు. నాన్నగారింత అబద్ధాలకోరని మాకు తెలియదు. ఈ రోజు మేము ఒళ్ళులో కష్టపడి [illegible] పని చెయ్యాల్సొచ్చింది. ఇదంతా నాన్నగారి నాటకం" అంటూ తల్లిపై విరుచుకుపడ్డారు. రామమ్మ భర్త మాటల్లోని అంతరార్థం గ్రహించింది. నల్గురిపిల్లల్నీ శాంతపరచి దగ్గిరకి తీసుకొని తలలు నిమురుతూ "అబ్బాయిలూ! మీ నాన్నగారు ఎప్పుడూ, అసత్యం చెప్పలేదు. అందుకనే ఆయనన్ని కష్టాలు పడ్డారు. ఇప్పుడు మీరు దొరక లేదన్న డబ్బు నంచులు సమయం వచ్చినప్పుడు మీకు తప్పకుండా దొరుకుతాయి. భయపడకండి. కనుక అది అలా వదలి యిప్పుడు మీరు నల్గురూ నే చెప్పినట్లువిని మనింట్లో బస్తాలకెత్తిఉన్న ధాన్యం పొలానికి తీసుకువెళ్ళి పొలం అంతా చల్లండి." అంది రామమ్మ. తల్లిమాట విని వాళ్ళునల్గురూ రాత్రికి రాత్రే పొలం అంతా విత్తులు చల్లారు. ఆ మర్నాటి నుంచి వర్షాలు ప్రారంభించాయి. పొలం అంతా వర్షంవల్ల నీరు నిండింది. కొన్ని నెలలు గడచే సరికి పొలం అంతా పచ్చగా పైరు లేచింది. చుట్టుపక్ల పొలంవాళ్లు కోతలు కొయ్యడం చూశారు. రాము, సోము, శ్యాము, భీము ఒక రోజు పిల్లుకూడా గను పొలంలో వరికోసి కుప్పలు నూర్చి బళ్ళకెక్కించి యింటికి తెచ్చారు. కొడుకులు చేసిన మంచిపని చూసిన రామమ్మ ఆనందానికి హద్దులేదు. కాని వాళ్ళ నల్గురికి తృప్తిలేదు. తాము కోరుకున్న డబ్బు దొరక లేదు పొలంలో. ఒకరోజు రామమ్మ నల్గుర్ని దగ్గరికి పిల్చింది. "నాయనల్లారా! యిప్పటివరకూ మీరు చేసిన పని చాలా బాగుంది. ఇప్పుడు మీరు నేను చెప్పినట్లు చేస్తే



"ఇంకా ఎంతదూరముండి రిజిస్ట్రార్ ఆఫీసు?"

చిత్రకారుడు: డి. ఎస్. నారాయణ (వాల్తేరు)

ఈసారి మీ డబ్బు సంచులు మీకు తప్పకుండా దొరుకుతాయి. సరే! నే చెప్పేది వినండి. మనకి ఈ సంవత్సరానికి సరిపోయేంత ధాన్యం ఉంచి మిగతా ధాన్యం బజారులో అమ్మండి" అని చెప్పింది. తల్లి మాటలు వాళ్ళకి సంతోషాన్ని కలిగించాయి. తమకి సంవత్సరగ్రాసం దాచుకొని మిగతా ధాన్యం అంతా ఆ రోజే బజార్లో హెచ్చు వెలకి అమ్మేశారు. అలా ధాన్యం అమ్మగా వాళ్ళకి నాల్గువేల రూపాయలు వచ్చింది. ఆ నాల్గువేల రూపాయలూ తీసుకువచ్చి తల్లికిచ్చారు. రామమ్మ ఆ నాల్గు వేలని నాలుగు గుడ్డసంచులలో వేరుగా పెట్టింది. రాము, భీము, సోము, శ్యాములను దగ్గరి పిల్చి నల్గురికీ నాల్గు సంచులుయిచ్చి యిలా అంది. "యిటు చూడండి అబ్బాయిలూ! మీ నాన్నగారు ఈ నాల్గు సంచులగురించే మీతో చెప్పింది. ఇప్పుడు మీ కా సంచులు లభించినట్లేనా! మీ గురించి బెంగతో కృంగి చనిపోయారు మీ నాన్నగారు. పోయేటప్పుడు మీకీవిధంగా జ్ఞానోదయం చేశారు. మీరే కనుక వ్యవసాయం చేస్తే ప్రతి సంవత్సరం యిలా డబ్బు సంపాదించుకోవచ్చు కదా! ఎప్పుడూ కష్టపడి పనిచేయడం లోనే సుఖం ఉందన్న విషయం మర్చిపోకండి. పనిఅంటే కోపగించుకొనే మీరు మీ నాన్నగారు 'పొలంలో డబ్బుదాచాను' అనగానే వెనుకముందు చూడక కష్టాన్ని గురించి ఆలోచించక పొలం అంతా తవ్వారు. నే చెప్పినమాట విని విత్తులు చల్లారు. ఆ పొలం పండింది. మీరు చేసిన కష్టానికి ఫలితంగా భగవంతుడు మీకీ డబ్బును యిచ్చాడు. ఈ డబ్బుకూడా మీరుభూమిని త్రవ్వి సాగుచేయబట్టేకదా మీకు లభించింది. యిదే మీ నాన్నగారి మాటలోని అంతరార్థం. ఇప్పుడు మీరే డబ్బును తీసుకొని సుఖంగాఉండండి. నాయనా!" అని ఆనంద బాష్పాలు కార్చింది రామమ్మ" తల్లి మాట విన్న వాళ్ళు నల్గురికీ కళ్ళు తెరచుకొన్నాయి. తండ్రిమాటల్లోని అర్థం గ్రహించారు. యిదవరకు (తమ) ప్రవర్తనకు తాముచేసిన దుష్కార్యాలకు సిగ్గుపడ్డారు. నల్గురూ ఒక్కసారి తల్లి పాదాలపై బడ్డారు. "అమ్మా! పూర్వపు మా ప్రవర్తనకు క్షమించు. యికనుండి నీవన్నట్లు కష్టపడి పని చేయడంలోనే సుఖం వుందనే పదాన్ని అనుసరించి కష్టపడి పని చేస్తామమ్మా" అంటూ లేచి తల్లి చేతిలో చేతులు వేసి ప్రమాణం చేశారు రాము, సోము, భీము, శ్యాము. రామమ్మ ఆనందానికి అంతులేదు. నల్గుర్నీ ఒక్కసారి కౌగలించుకొని "సుఖంగా ఉండండి నాయనా" అంటూ దీవించింది. అప్పటినుంచీ వాళ్ళు నల్గురూ కష్టపడి పనిచేస్తూ ఆ వూర్లోకి మంచి రైతుల్లో ఒకళ్ళనిపించుకున్నారు. "కథ కంచికీ, మనమింటికీ" ★



రోజంతా తాజాగా ఉండుటకు

# పాండ్స్

## డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

వాడండి!

రోజూ స్నానానంతరము
తేలికైన పరిమళముగల
పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్
ఒళ్లంతా జల్లుకోండి. అది
చెమటను పీలుస్తుంది మరియు
మిమ్మల్ని రోజంతా హాయిగా,
తాజాగా ఉండేలా ఉంచుతుంది!

*ప్రపంచమంతటా సౌందర్యవతులు*
*దీనినే ఎన్నుకొంటారు*




చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఏ. లో సంస్థాపితము)

# చిత్ర సమీక్షలు

పోయి, క్రమంగా విమల అనంతగిరి రాజ్యానికి చేరుతుంది. తల్లి ఆమెను సొంత తల్లిగా చూస్తుంది. అక్కడే విజయుడూ వుంటాడు. విమలా విజయులు మహారాజు హత్య విషయం పరిశోధనలో గమత్ గమత్ లన్నీ చేసి పడుతున్న శ్రమ రక్తి కట్టిసారు. గోపాలం వేషంలో విజయుడు బట్లర్ (రేలంగి)తో స్నేహం చేసి అసలు హత్యావిషయం బయటపెట్టించి నీ ఐ డీలకు అప్పచెబుతాడు దాంతో కథ నానా అవస్థలూ పడి కంచికి చేరుతుంది.

కథ అతుకులబొంత. అసందర్భాలన్నీ ఎడిట్ చేస్తే ఒక సందర్భం తయారుచేయవచ్చునీ, ఆసందర్భం ఒక ప్రదర్శనంగా కాణించనూవచ్చునీ 'విమల'నుచూసి అంతా అంగీకరిస్తారు.

మనకున్న కనీసపువిజ్ఞానంలో కొంతకొంత త్యాగం చేస్తుంటే వినోదం పుడుతూ వుంటుంది. అలాగే ఆ పద్ధతిమీదే ఈ చిత్రంలోనూ వినోదం పుట్టింది. 'అందరూ హాయిగా నవ్వటం' మన చిత్రాల ఆదర్శం. ఆ నవ్వుకు ప్రయత్నం మన చిత్రాల నిర్మాణం. విమల అలా జనాన్ని నవ్విస్తుంది. కథను విడచి సాముచేసే కలంపుంటే హాస్యం అపారంగా పుడుతుంది. చిత్రంలో రచయిత ముద్దుకృష్ణ ముక్తాయింపులు హాస్యం తోణికిసలాడేలా వున్నాయి.

పాటల రచన పాటల బాణీల రచన చక్కగా వుంది. సంగీత దర్శకుడు ఎస్. ఎం. సుబ్బయ్యనాయుడు (అగ్గిరాముడు) వినిపించిన కమ్మని సంప్రదాయ సంగీతం షడ్రసోపేతమైన భోజనంలా ఉందని అనందించేవారు చాలామంది వుంటారు. విమలమైన సంగీతం పున్నాగవరాళి, ఘుమఘుమలతో చెవులకు చవులూరిస్తూ అహ్లాదంగా ఉంది. 'అంబా కామాక్షీ' కీర్తన, విమలచేసిన జావళీ నృత్యం, యుగళగీతాలు, కేవలం జన మనోభిరామంగా ఉండటానికి రెండు హాస్య యుగళగీతాలు—మొత్తంమీద పాటలన్నీ బాగున్నాయి. కొన్ని పాటలు చెవులకే చుట్టాలుకాని, నాలికపై నాట్యమాడవు.

నాయికా నాయకులు సావిత్రి, ఎన్. టి. రామారావు, చాలా చక్కగా నటించారు. వారి నటన రక్తి కట్టడానికి మేకప్ కారుల కృషి కూడా కారణం. వారిద్దరూ దర్శనీయులుగా వున్నారు. రాజేశ్వరం ప్రసాద్ గా గుమ్మడి చాలా హుందాగా నిదానంగా నటించాడు. రేలంగి హాస్యం ఇటీవల మళ్లీ ఈ చిత్రంలో చాలా చురుగ్గా మెరుగ్గా వుంది. రమణారెడ్డి, సూర్యకాంతం, సంధ్య, వి. యస్. శర్మ బాగానే నటించారు. ఛాయాగ్రహణం యింపుగా ఉంది.

నిర్మాత, దర్శకుడు యస్. యమ్. శ్రీరాములునాయుడు 'అగ్గిరాముడు' తోరణిలో తీసిన ఈచిత్రం ఒకసారి చూడదగినది.



నల్లపరెడ్డి బ్రదర్సు వారి 'కన్నకూతురు'లో నాగేశ్వరరావు, అంజలి.



అశ్వరాజ్ వారి 'దీపావళి'లో సావిత్రి, ఎస్. వరలక్ష్మి, రంగారావు, రమణారెడ్డి, పితి,

## ది మిరకిల్

వానలు లేక కరువు కాటకాలుగా ఉన్నాయని మైకేల్ చెబుతాడు.

వాటర్‌లూ యుద్ధానికి వెల్బన్‌దళంతో మైకేల్ తరలిపోతాడు. తెరెసా చిక్కాలయానికి తిరిగివచ్చి విగ్రహంలేని పూజా వేదికముందు సాష్టాంగపడి తనను మన్నించమని, తాను ప్రేమించిన మైకేల్ సుఖంగా రావాలని ప్రార్థించి, మానవసేవకు ధర్మనిర్వహణకు తనను పునరంకితం చేసుకుంటుంది. ఆమె తెలవారుగా మేరీ విగ్రహంలేని పూజా వేదికముందు సొగిలబడిపోతుంది. ఇంతలో తెరెసావేషంలోవున్న మేరీ ఛాయామాత్రంగా తెరెసాను మన్నించి యథాప్రకారం వేదికపై విగ్రహంగా మిగిలిపోతుంది.

ఎండి బీడయిన దేశమంతా ముంచెత్తే ముసురుపట్టి ఆక్షణంలో జడివాన కురుస్తుంది. చర్చినిండా జనంచేరి ప్రార్థనాగీతాలు ఆలపిస్తారు.

ఈ చిత్రం ఈ కాలంలో రాణించడం అసలు చిత్రం. నాగరీకులపట్లనే మాట వర్తిస్తుంది. అయితే మతంపట్ల అమిత గౌరవం కలవారికి ఇది చిత్రం కాదు-సత్యం. ఏది ఏమైనా కేవలం బాద సంగా కనిపించే కాండవభావాలకు ముడిపెట్టి దేవుడికోసం వసే వానలు కురవక పోవడంవంటి మూఢనమ్మకాలను చిత్రించడంతోను, తలరాతకు ప్రాధాన్యమిచ్చి అంతా దానిలోనే ముడివేసుకుంటుందనే భ్రమలతోను కథ నడపడం ఈ రోజులకు వెగటుగా వుంటుంది. అందుకే మతంతో ముడిపెట్టారు. దానికి ఎదురులేదు. కేవలం కథని ఈ బాద సంబంధంనుంచి విడదీస్తే బాగుండేది. అసలు కథలో అందం ఈ బాద సంతంతో ముకముకలాడింది.

తెరెసాగా కరోల్ బేకర్ నటన అద్భుతంగా ఉంది. కాప్టెన్ మైకేల్‌గా రోజర్ మూర్, గైడోగా విటోరియో గాస్‌మాన్, కార్లోబాగా గస్టావో రోజో చాలా చక్కగా నటించారు. కథ కెర వేగంతో నడచి 121 నిముషాలు కళ్లుమరపిస్తుంది. ★

## కాలేజ్ గర్ల్

రావల్ ఫిలింస్ వారి 'కాలేజీ గర్ల్' ప్రస్తుతం మద్రాసులో ప్రదర్శింపబడుతోంది. సుదీర్ఘమైన డైలాగులు, మందమైన గమనం, రక్తిలేనికథ, అతిఅభినయం, నిరాశ కలిగించే సంగీతం కలసి 'కాలేజ్ గర్ల్' రూపంలో విడుదల అయినట్లు మనస్సులో నిష్కర్షగా చెప్పుకునేవారు నూటికి నూరుపాళ్ళు వుంటేనే అనుకున్నమాట నిజం కావాలనిలేదు. అయితే కేవలం ఒకటి రెండు పాటలు వినిపించినా బాధించనందునా, కేవలం ఒకనటుడు ఒక్క కరుణాత్మక సన్నివేశంలో స్వతహాగా హాస్యచతురుడైనా కన్నీళ్ళొలికించ చేసినందునా, ఈ చిత్రం చూసిన తర్వాత అలా అనుకునేవాళ్ళ సంఖ్య కొంత తగ్గవచ్చు.

నాటువైద్యుడైన తండ్రి మాట వినక వైద్యశాస్త్రం అభ్యసించి తనను బయటికి గెంటివేసిన ఆ తండ్రికే, వర్షంలో అతన్ని కూర్చోపెట్టుకుని రిక్షాలాగడం వంటి ఘనకార్యాలు చేసి నేత్రదానం చేసిన కూతురు కథ ఈ చిత్రం కథ. ఈ ఒక్క ముక్కలో నా విన్నంత బాగుండదు తెరమీద!

కథలో బలంలేదు అనడం ఈ చిత్రం విషయంలో తప్పు అవుతుంది. బలహీనుడికి బలం లేదనుకోవడం విపరీతం, చర్విత-చర్వణం.



'దేవుడుచేసిన మేలు'లో అల్లు రామలింగయ్య



ఏటీ రాజావారి "విమల"లో
ఎన్. టి. రామారావు అభినయం.

అనవసర సన్నివేశాల కల్పన, మూకనృత్యాల అల్లాయిగానలోలత్వం, హీరోయిన్ చేత వర్షంలో రిక్షా లాగించడం, తప్పనిసరిగా ఒక బలాత్కార సంఘటనా నాటకం, అందులో హీరోను, అసలుకథలో హీరో చేత వేడి చెంపదెబ్బ, హీరోయిన్ హీరోల యుగళగీతం-ఇవి ఎడనెమె హాల్లో తెర సన్నిహితజనమనోభిరామంగా హాలంతా ఈలగోల చేయించే 'క్లయిమాక్సు'లుగా రూపొందిన నాటినుంచి 'కాలేజ్ గర్ల్' వంటి చిత్రాల భవిష్యత్తు బంగారంతో ముడివేసుకుపోయింది. శంకర్, జైకిషన్ సంగీతం సరదాగా హాయిగా వినిపించలేదు. ప్రత్యేకత కనిపించలేదు. ఎప్పుడూ ప్రవహించే జీవనది మూడునెలలు ముచ్చటగా గలగలలాడే సెలయేటిలా మురిపించక పోవచ్చు.

అరవసినిమా డైలాగుల్లా ఉన్న భీషణ సంభాషణలతో రణగొణధ్వనిగా ఉంది చిత్రం. కళ్ళతో చెవులుకూడా అలసిపోయే ఈ ప్రదర్శనలో [illegible]



లలితకళా నికేతన్ వారి 'భక్తజయదేవ'లో అంజలి, నాగేశ్వరరావు.

# "ఒన్స్ మోర్ విత్ ఫీలింగ్"

యుల్ బ్రిన్నర్, కేకెండాల్ నటించిన "ఒన్స్ మోర్ విత్ ఫీలింగ్" కొలంబియా చిత్రం. కాలక్షేపానికి పుట్టిన ఈ చిత్రం పుట్టిన పని పూర్తిచేస్తుంది. ఇందులో ఆకర్షణ మొత్తంమీద ఒక్కటే. సంభాషణలు సమయస్ఫూర్తితో కూడుకున్న చక్కని హాస్యంతో ఎంతో సరదాగా ఉన్నాయి. భావం కవి ప్రసాదిస్తే జీవం నటుడు కలిగిస్తే గాని డైలాగు రక్తికట్టదు. అందుకు ఈ చిత్రం సాక్షి.

చిరుకోపం గల యిద్దరు భార్యాభర్తలు—చిత్రమైన మనుష్యులు. అందులో భర్త సంగీత ప్రియుడు. భర్తని అపారంగా ప్రేమించే భార్య, సంగీతం గొడవలో సంసారం మర్చిపోయాడని విడాకులు ఇస్తానని కూడా విడాకులు ఒక ఏడు ఎక్కువ చదివి ఒకరికొకరు ఎదురు తిరిగి మధ్య రాజీకారులకు రాత్రిళ్లు నిద్రలేకుండా చేసిన 'ఇంటిగొడవ' దీనికి కథావస్తువు. గొడవపోయి మమత చిక్కన కావడానికి ఎడబాటే తగిన మందని మూడురోజులు విడదీయడానికి మరో మిత్రుడు వేసిన చిట్కాతో గమత్తుగా కథను పూర్తి చేశారు. మధ్య మధ్య మనకు అట్టే స్వారస్యంగా ఉండని ఆంగ్ల సంగీతం కూడా ఉంది. అసమాన వేగంతో నడుస్తుంది చిత్రం.

ఇవన్నీ ఒక ఎత్తు. చిత్రంలో 'సెట్స్' నిర్మాణం మరో ఎత్తు. సంగీతగాయకుడి మందిరం అలంకరణ సకౌగణంగా ఉంది. కుడ్యాలపై చిత్రించబడిన హీరో వర్ణచిత్రాలు అనేకం కథాకథనానికి ఎంతో తెలివితో ఉపయోగించుకున్నారు.

'హీరో' నవరసభరిత చరిత గలవాడు. అతనికి ఏ క్షణంలో ఏ రసం వస్తుందో తదనుగుణంగా వెనక వర్ణచిత్రం ఉండి కథాకథనం తేలికగా తెలిసిపోతూ ఉంటుంది. ఇదిమాసే కనిపించే విషయం. చెప్పకుంటే అట్టే తెలీదు. కాలక్షేపానికి ఒకసారి చూస్తే మళ్ళీ చూడాలనుకుంటారు.

యుల్ బ్రిన్నర్ నటన చాలా ప్రశంసనీయంగా ఉంది. గయ్యాళి గంపగా షేక్స్పియర్ కాథరిన్ (టేమింగ్ ఆఫ్ ది ష్రూ)ను మరపించింది కేకెండాల్!

---

వై జయంతీమాల, షమ్మీకపూర్. తదితరులు ఓంప్రకాశ్, పూర్ణిమా, బేబీ తబుసమ్ వగైరా. ప్రతిభావంతుడూ విజయ (మార్గ) దర్శకుడూ తాతినేని ప్రకాశరావు ఈ చిత్ర దర్శకుడు!

# మద్రాసు మనసు హరించిన కూచిపూడి ఉషా కన్య!

## శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ

ఆగస్టు ఆరవ తేదీ సాయంకాలం త్యాగరాయనగరంలోని వాణీమహల్ కిటకిటలాడి పోతోంది. దీపతోరణాలతో, రాకపోకల గడబిడలతో...మంత్రముగ్ధులైన ప్రేక్షకుల కరతాళ రాగయుక్తంగా వేదికపైన నవరసభరిత నాట్యప్రదర్శనం. అది కూచిపూడి వారి 'ఉషాపరిణయం' అనగానే పండు పండిన కళాకారు లొకరు కళ్లనీళ్లతో తళుక్ మనగా 'మళ్లీ ఎన్నాళ్లకు' అన్నారు.

భరతనాట్యరీతికి ప్రథమశాఖ, సంప్రదాయసిద్ధమైన ఆంధ్ర నాట్యకళ అయిన కూచిపూడి రీతికి ప్రాణవాయువు కరవైన ఈ రోజులలో, ఆ కళాలక్ష్మి వేదికపై గజ్జె కట్టకపోగా, సాటికళలలో తలెత్తుకు తిరగలేని స్థితిలో, తిరిగి ఒకసారి ఆంధ్ర ద్రవిడ కళాసంస్కృతీసంగమస్థలమైన మద్రాసులో రసికజనసమక్షంలో ఆ కూచిపూడి కళాలక్ష్మి తన కాలిమంజీరాల ఘలంఘల వినిపించడం తెలుగువారందరూ గర్వించే విషయం. ముఖ్యంగా ఈ నాట్యప్రదర్శన ఏర్పాటుచేసి సక్రమంగా నిర్వహించగలిగిన నిర్వాహకులను అంతా అభినందిస్తారు.

అన్ని నాట్యకళారీతులకు వలెనే కూచిపూడి నాట్యం ప్రాచీనమైన రీతి. ఇందులోనూ నృత్య, నృత్త, నృత్యనాటక రీతులన్నీ వున్నాయి. నృత్యనాటకాలలో హరిశ్చంద్ర, భక్త ప్రహ్లాద, ఉషాపరిణయం, భామాకలాపం కూచిపూడివారికి పేరు తెచ్చాయి. అయితే చిరకాలంగా ఆదరణ లేక కళాస్రవంతి ఎండిపోయి మరుభూమిగా మారిపోతున్నది కూచిపూడి. అక్కడి నుంచి చిత్రరంగానికి తరలివచ్చిన ఆచార్యులు కొందరు కొంతకొంత కూచిపూడి నాట్యరీతికి ఎప్పుడో ఒకసారి తెరమీద చోటుకలిగించినా సంప్రదాయ సిద్ధమైన కూచిపూడి భాగవతం దాదాపు కనుమరుగై పోయింది. కాగా, కూచిపూడి కళల ఉద్ధరణ నాట్యకళాశాల నిర్మాణం మొదలయిన మాటలు మాత్రం వినిపిస్తూ వున్నాయి.

ఈ సమయంలో మద్రాసులో కళాకారులంతా కలసి వాణీమహల్‌లో ఏర్పాటుచేసిన 'ఉషాపరిణయం' ప్రదర్శనానికి పురప్రముఖులూ, శాస్త్రకారులూ, నటీనటులూ, దర్శకులూ, రచయితలూ, ఆంధ్రులూ, ఆంధ్రేతరులూ కూడా అనేకులు వచ్చారు.

కూచిపూడి కళాకారులలో మిగిలిన ఏకైక కళామండలి శ్రీ చింతాకృష్ణమూర్తి బృందం ఈ నృత్యనాటకం ప్రదర్శించారు. ఉషా కన్యగా అచిరకాలంలో అచిరాంశువులా ప్రేక్షక హృదయాకాశంలో వెలిగి లబ్ధప్రతిష్ఠుడైన యువకుడు శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మ నటించారు. వీరిదివరకు, ఆంధ్రలోనూ, రాజధాని ఢిల్లీలోనూ కూడా అధికార అనధికారులతోపాటు, శాస్త్రకారుల, కళాకారుల ప్రశంసలు అందుకున్నారు.

వేదికపైకి ఉషాకన్యక రాగానే సుందరో మన్నవిదో దిగివచ్చినట్లు, "ఆమె" కనులు అలసత్వంగా మూసి తెరవగానే తారకాయుగళి తళుక్కుమన్నట్లు, చిరునవ్వునవ్వితే, 'కప్రంపు చిరుపాదు లుప్పనతివెగా ఊదినట్లు' సుందర మందగామిని ఆమె అలా రెండడుగులువేస్తే కూచిపూడి 'కలభ సుందరగమన' తరంగం రూపు దాల్చి కదలినట్లు, మోహనరాగం ఘనీభవించి అసలుమోసులెత్తించే ఆ పదహారేళ్ళ బాలాకుమారిని చూసి ప్రేక్షకులు అనిమిషులై పోయారు నిముషంపాటు! శృంగార అభినయంలో నాటక రంగస్థలంపైని మేటి నటుల దీటులన్నీ సూటిగా రొంబట్టుకోగలిగిన వేదాంతం సత్యనారాయణశర్మ కూచిపూడి వేదికపై వెలుగుతున్న కళాకళిక. తెలుగు అభినయచాతుర్యం ఏమిటో కళ్లారా చూసి, ఇతరులకు చూపింపగలిగిన కళాప్రియులు—కూచిపూడి నాట్యకళా పునరుజ్జీవనానికి నాందీగీతం పాడిననాడు కారణజన్ములే అవుతారు. అయితే అడిగేవారూ, ఆదరించేవారూ లేక తుప్పుపట్టిన కూచిపూడిరీతిని అభివృద్ధిచేసి, పాతపద్ధతులూ, రీతులూ నవీనం చేయవలసిన అవసరం ఎంతవున్నదో కూడా 'ఉషా పరిణయం' నాటకం చూచాయగా తెలియచెబుతుంది.

'ఉషాపరిణయం' నాటకంతో సకలజన మనోభిరామమైన కూచిపూడికి మంచి రోజులు రావాలని అందరూ ఆశిస్తారు. ★



హైదరాబాద్ మూవీస్ వారి "జల్సారాయుడు"లో జగ్గయ్య, జ్యోతి.

# "సినిమాటలు"

ఒక రచయిత వ్రాసిన మాటలు అయిదారు మందికన్నా చదవకపోయినా అతను సగటున సంవత్సరానికి 75,000/- సంపాదిస్తాడంటే కొంచెం చిత్రంగానే ఉంటుంది. పైగా ఈ రచయిత తను వ్రాసిన రచనలను గురించి చాలా అసంతృప్తి పడడమే కాక వాటిని చరమ చెత్తగా పరిగణిస్తున్నాడంటే మరింత వింతగా ఉండక తప్పదు! కాని శాటర్‌డే రివ్యూలో సినిమా 'స్క్రిప్టు' వ్రాసేవారిపైన కొలంబియా పిక్చర్స్ కథల శాఖలో పనిచేస్తున్న విలియం ఫాడిమాన్ వ్రాసిన వ్యాసంలోని సంఖ్యపైన ఇవ్వబడింది. ఒక సినిమా 'స్క్రిప్టు' చదివేవారు కొద్దిమందిలోనే ఉంటారు — ప్రొడ్యూసర్, డైరెక్టర్ వగైరా. ఆ చదివేవారు కూడా పెద్ద సాహిత్యాభిరుచి కలవారుగా ఉండరు. అంతకుముందు 'బాక్సాఫీస్ హిట్' అయిన మరొక సినిమా మాటలనుబట్టి వారికున్న జ్ఞానంతో రచయితలకు సలహాలు ఇస్తూ ఉండటం వారికి అలవాటే.

అమెరికాలో సినిమా రచయితల ఆదాయాలు అధికంగా ఉండటమే కాక వారికి బలమైన 'యూనియన్' కూడా ఉన్నది. దానిలో 1800 మంది సభ్యులు ఉన్నారు. వీరి మొత్తం ఆదాయం 13,50,00,000/- మంచి 75,000/- సగటు ఫాడిమాన్ అంచనా వేశారు.

1959 సం॥ లో ఒక రచయిత 7,50,000 సంపాదించాడు! అయినా వారందరూ తమ రచనలను లోకువగా చూడటానికి కారణాలేమిటో ఫాడిమాన్ వివరించారు. పుస్తకాలు వ్రాసేవారు కూడా తమ్ము కోసమే వ్రాయచ్చు కాని కేవలం ప్రొడ్యూసర్ వంటివాడు చెప్పినంత మాత్రాన 'స్క్రిప్టు'ను తొమ్మిది పదిసార్లు తిరిగి వ్రాసే అవసరం వారికి లేదు. ఎవరో హాక్స్లీ, గ్రీన్ వంటి వారు తప్ప సామాన్య ప్రజలకు సినిమా రచయితల పేర్లు తెలియనే తెలియవు — కాని ప్రతివారం ప్రపంచమంతటా సుమారు ఇరవై కోట్లమంది సినిమాలు చూస్తారని లెక్క వేయగా తేలింది.

ఒక చిత్రమైనా విజయవంతమయినదంటే మాటలు కొంతవరకయినా తోడ్పడి ఉండాలి; ఇది ఒప్పుకున్నప్పటికీ మాటలు వ్రాసేవారికి వారి పరిశ్రమలో తప్ప బయట సన్మానాలేవీ జరగటంలేదని ఫాడిమన్ అంటున్నారు.

ఈ విధంగా తమను తామే లోకువగా చూసుకోవడం అనవసరమని ఫాడిమన్ వ్రాశారు. చదివేమాటకూ తెరపైన బొమ్మలు చూస్తూ వినేమాటకూ చాలా భేదం ఉన్నది. అందుచేత సినిమాలకు వ్రాసేమాటలను పుస్తకాలలో వ్రాసేమాటలతో పోల్చి లోకువకు గురిఅవుతున్నామనే దిగులు అక్కరలేదు. తమ వృత్తి తక్కిన సాహిత్యప్రక్రియల కేమీ తీసిపోదని వీరు గ్రహించాలి.

తెలుగు రచయితలలో పెద్దవారు చాలా మంది సినిమా మాటలు వ్రాస్తున్నారు. పుస్తకాలవల్ల వారికి వచ్చేఆదాయం అతిస్వల్పం. కనుకనే సినిమా రచయితలయినా రసటంలో అతిశయోక్తి లేదేమో — ఇష్టపడి స్క్రిప్టు తయారు చేసి ఉంటారని నమ్మడం కష్టం. సాధారణంగా సాహిత్యాభిలాష ఉన్న ప్రతి వ్యక్తికీ తెలుగు భాషలో పుస్తకాలు చదువుకునే అవకాశం ఉన్నది. ఇంగ్లీషు పుస్తకాలతో సరితూగవని అనుకున్నా, అనుకోనకపోయినా మొత్తంమీద వాటితో పోల్చడానికైనా అవకాశం ఉన్నది. కాని మామూలుగా చదువుతున్నవారు తెలుగుసినిమాలు తెలుగువనే అభిమానంతో చూడాలి తప్ప నిజంగా చూసి సంతోషించలేరు. వీరికి మిగిలేవి మాటలు మాత్రమే. ★

# వగైరావగైరా

ఆది చిత్రలోకం. సినిమా కథాగాన మంజువాటి. దేవదానవ పాత్రధారులూ తెర నాటక సూత్రధారులూ విహరించే విజయా స్టూడియో ఉద్యానవనం. సూర్యుడు అధిష్ఠానదేవత అయిన మధ్యాహ్న సమయం. ఉన్నట్టుండి ఉలిక్కిపడేలా ఆక్రందన! ఆర్తాలాపం! అందులోనూ దుఃఖశ్లేష — అసలు విశేషం స్త్రీ కంఠం — అర్థంకాని కన్నడంలో!

## కథాక్రమం

వినిపించేవైపు వెళ్లిచూస్తే బ్రహ్మాండమయిన దేవేంద్రభవనం. చుట్టూ ఉద్యానవనం. గ్రాంథికంలో డిటెక్టివ్ నవలలాగా ఎవరో ఎరుగున్న ముఖం జానపద ప్రబంధ నాయికా వేషంలో. కన్నడంలో చిన్నగా తిన్నగా డైలాగులు చెప్పేస్తున్న ఆనటి తెలుగునటి. కన్నడం అవడం ఆగడం అడగడంలేకుండా చకచకా మాట్లాడడంచూస్తే కన్నడ సినిమా డైలాగులు మంచినీళ్ళప్రాయంగా వుంటాయి కాబోలు అనిపించింది. అందులో తెలుగుతార అలా చెప్పేయడం తెలుగు డైలాగులే తెలిసినవారికి ఆశ్చర్యం కలిగిస్తుంది. కనుకనే కలిగింది! తరువాత వెంటనే ఆమె అదేమాటల్ని తెలుగులో అనేసింది. "ఈ అవహేళనని అవమానాన్ని నేను భరించలేను. నేను నిష్కళంకని నిరూపించు ..." ఇలా సాగిపోయింది.

## వరసక్రమం

వినిపించింది గొడవ! తెలుగు, కన్నడ భాషలలో ఆ అమ్మాయి ఆక్రందన! అని అడక్కముందే అదే చెబుతున్నానంటూ మరో చిత్రమిత్రులు టూకీగా ఇలా చెప్పారు.

అది తెలుగు, కన్నడ భాషలలో మహేశ్వరీపిక్చర్సువారు నిర్మిస్తున్న జానపద-చిత్రం- పేరు "రమాసుందరి". ద్విపాత్రాభినయం చేస్తున్న ఆనటి కృష్ణకుమారి. అందులో 'క్లయిమాక్సు' దృశ్య చిత్రీకరణం జరుగుతోంది. ఎంతో ఓపికతో నటి కృష్ణకుమారి, దర్శకుడు బాన్నార్ కృష్ణమూర్తి ఘట్టం రక్తికట్టేందుకు కృషిచేస్తున్నారు. తెలుగు డైలాగులు ముద్దిపట్ల సూరి. పాటలు శ్రీశ్రీ, ఆరుద్ర, వడ్డాది రచిస్తున్నారు. రామకృష్ణ, కాంతారావు, కృష్ణకుమారి, గిరిజ, బాలకృష్ణ, కె. వి. ఎస్. శర్మ మున్నగువారు నటిస్తున్న ఈ చిత్రానికి సుసర్ల దక్షిణామూర్తి సంగీతం, వేణు ఛాయాగ్రహణం, గోడ్‌గాంకర్ కళ నిర్వహిస్తున్నారు. ఒక్కదృశ్యం చిత్రీకరిస్తే నిర్మాణం పూర్తిఅవుతుంది. సెప్టెంబరు చివరి వారంలో చిత్రం విడుదల అవుతుంది. ★

# న్యూఢిల్లీ లేఖ

(16-వ పేజీ తరువాయి)

కూడా కొన్ని సందర్భాలలో తూర్పు యూరోపు దేశాలనుంచి దిగుమతి చేయడానికి అనుమతి లభిస్తున్నదని కొందరు ఆరోపిస్తున్నారు. ఇది నిజమైతే బ్రిటన్ మున్నగు పశ్చిమదేశాలపట్ల వివక్షత చూపుతున్నారని భావించవలసి వస్తుంది.

మెషిన్ టూల్స్ దిగుమతులు మొత్తం మీద పెరిగినా 1957 తో పోల్చితే 1959లో బ్రిటన్‌నుంచి దిగుమతిచేసిన పరికరాల విలువ చాలామట్టుకు తగ్గినది.

బ్రిటన్‌నుంచి దిగుమతి చేసే మెషిన్ టూల్స్ విలువ తగ్గడమే కాదు మొత్తం దిగుమతులలో బ్రిటన్ వాటాకూడా తగ్గినది. దానితోపాటుగా తూర్పు యూరోపుదేశాలనుంచి దిగుమతి పెరిగినది. ఆ దేశాలనుంచి వాటా రెండింతలు అయినది.

పైగా కొన్నిరకాల మెషిన్ టూల్స్‌ను బ్రిటన్‌నుంచి దిగుమతి చేయడం పూర్తిగా మానివేసి తూర్పు యూరోపునుంచే దిగుమతి చేస్తున్నట్లు గోచరిస్తున్నది. ఇది కేవలం ఆయారకాల పరికరాలు మాత్రమే తయారు చేసే సంస్థలకు పెద్దదెబ్బ.

తూర్పు యూరోపునుంచి అంతకంతకు అధికంగా మెషీన్‌టూల్స్ దిగుమతి చేయడానికి ప్రభుత్వ వాణిజ్య సంస్థకు అనుమతి ఇస్తున్నట్లు కూడా కనుపిస్తుంది. 1959 లో రెండుకోట్ల రూపాయల విలువకలిగిన పరికరాలు దిగుమతి చేయడానికి ఆ సంస్థకు అనుమతిఇస్తే ఈ ఏడాది అప్పుడే మూడు కోట్ల రూపాయల విలువకలిగిన పరికరాలు దిగుమతి చేయడానికి అనుమతి ఇచ్చారు. ఇది అయిదుకోట్ల రూపాయలవరకు పెరుగుతుందట. అంటే మొత్తంమీద దిగుమతుల విలువ ఇతోధికంగా పెరగకపోతే బ్రిటన్‌నుంచి దిగుమతులు ఇంకా తగ్గుతవి.

ప్రభుత్వ వాణిజ్య సంస్థద్వారా అధికంగా దిగుమతి చేసేపద్ధతి అవలంబించడంవల్ల కొందరు వ్యాపారస్తులు మాత్రం నిలువలలోనుంచి సరకు సరఫరాచేయగల స్థితిలో ఉండడం తటస్థిస్తుంది. చిరకాలంగా దిగుమతి చేసే సంస్థలకు తక్కువకోటాలు ఇవ్వడంవల్ల బ్రిటిష్ పరికరాలు దిగుమతిచేసే వారికి ఈ సౌకర్యంలేదు.

బ్రిటన్‌నుంచి దిగుమతి చేయగోరే వినియోగదారులతోకూడా తూర్పు యూరోపు దేశాలవద్దనుంచి సరకుకొనమని అధికారులు చెబుతున్నారట.

ఇతరదేశాలనుంచి దిగుమతి చేయరాదని నిషేధించిన రకాలుకూడా విక్రయించగలమంటూ తూర్పు యూరోపు దేశాలవారు పత్రికలలో వాణిజ్య ప్రకటనలు చేస్తున్నారు.

చెప్పుతోం దా అమ్మాయి.

తన సరసన కూచుని, తపస్సమాధిలోవలె గాంభీర్యం నటిస్తూవున్న ఆ అమ్మాయి తన కింతకు ముందెప్పుడో తెలిసినట్టు జ్ఞప్తికి తెచ్చుకున్నా డా అబ్బాయి.

ఆ అబ్బాయి నుదురుమీది మాయనిమచ్చ తనకు సుపరిచితమయిందిగా కనిపిస్తుందేమిటి చెప్మా!—అనుకుంది అమ్మాయి.

ఆ అమ్మాయి చేయిమీది చెరగని మరక తనకు చిరపరిచితమయిందిగా తోస్తుందేమిటబ్బా!—అనుకున్నాడు అబ్బాయి.

ఆ అమ్మాయి తన ఎద గదిలోకి చూపులు మరల్చుకుంది. ఆ అబ్బాయి నుదురుమీది మాయనిమచ్చ తాలూకు జాడలు పొడగా నయినా పొడగట్టయ్యేమోనన్న ఆశతో.

ఆ అబ్బాయి తనస్మృతి పథపు టరలోకి చూడ్కులు నిగిడ్చాడు! ఆ అమ్మాయి చేయిమీది చెరగని మరక బాపతు ఛాయలు చూచాయగా నయినా కనిపిస్తయ్యేమోనన్న అనుమానంతో.

# బావా-మరదళ్లు

(10-పేజీ తరువాయి)

ఇద్దరి బుర్రల్లోనూ సినిమారీళ్లమాదిరి గతంగిర్రున తిరిగింది.

ఆ అబ్బాయి ఆ అమ్మాయికి బావ.

ఆ అమ్మాయి ఆ అబ్బాయికి మరదలు.

తమఊళ్లో బడిలేనందువల్ల ఆ అమ్మాయి ఊరెళ్లి వాళ్ళయింట్లో నేవుంటూ బాల్యంలో చదువుకున్నాడా అబ్బాయి. కాని కొంత కాలానికి వాళ్ళ తల్లిదండ్రులు ఏదో విషయంగా పేచీపడి బంధుత్వాన్ని తెగదెంపు చేసుకున్నారు. అంతటితో ముక్కుపచ్చలారని ఆముగ్ధప్రాయంలోనే ఆ అబ్బాయి అమ్మాయి లిరువురూ ఒకరికొకరు దూరమయ్యారు.

తన యింట్లో చదువుకునే రోజుల్లో ఆ అబ్బాయి నా అమ్మాయి తంతెలమీంచి తమాషాగా క్రిందకు త్రోసిం దో సారి. అప్పుడు తగిలినగాయమే ఆ అబ్బాయి నుదురుమీది యిప్పటి మాయనిమచ్చ. ఆరోజుల్లోనే ఆ అమ్మాయి చేయిమీద ఆ అబ్బాయి సిగరెట్టుపీకతో సరదాగా చురక వేశాడో పర్యాయం. ఆ నాటి కాలినగాయమే ఆ అమ్మాయి చేయిమీది ఈనాటి చెరగనిమరక.

"హా, తెలిసెన్!" అనుకున్నాడు అబ్బాయి.

"అహా, తేటపడెన్" అనుకుంది అమ్మాయి. ఇంతలో బస్సు పబ్లిక్ గార్డెన్ ముందాగింది.

అబ్బాయి దిగాడు.

అమ్మాయి దిగింది.

"బావా మరదళ్ల మధ్య పానకంలో పుడకలా మన మెందుకని బస్సుముందుకు సాగింది.



# ఆంధ్రప్రదేశ్

(6-వ పేజీ తరువాయి)

సుతోంది. గౌతమి పాయమీద వంతెన నిర్మితమవుతోంది. కర్నూలుదగ్గర తుంగభద్రమీద వంతెనను ఇటీవలే గవర్నరు ప్రారంభోత్సవం జరిపారు. గోదావరి వశిష్ఠపాయమీద కూడా వంతెన నిర్మిస్తున్నారు.

జాతీయం అయిన బస్సుమార్గాల నిర్వహణకు ఏర్పడిన కార్పొరేషన్ కృష్ణాజిల్లాలో కార్యక్రమమును పూర్తిచేసి 1960 ఏప్రిల్ నుండి పశ్చిమ గోదావరిజిల్లాకు కార్యకలాపాలను విస్తృతము చేశారు. డిశంబరునుండి ఈ కార్యక్రమం గుంటూరుకు విస్తృతము చేస్తారు. 1961 మార్చినాటికి ఈ రెండుజిల్లాల్లో బస్సులన్నింటినీ జాతీయంచేయదలచారు. జాతీయం చేసిన మార్గాలలో నడిపేందుకుగాను రు 2 కోట్ల 40 లక్షలు ఖర్చుచేసి 500 కొత్త బస్సులు కొనాలని నిశ్చయించారు. జాతీయం అయినతరువాత బస్సురవాణా ఏవిధంగా సాగుతున్నదీ పరిశీలించేందుకు శ్రీ అనంతరామకృష్ణన్ అధ్యక్షతక్రింద ఒక సంఘాన్ని నియమించారు. బస్సులు జాతీయం అయిన తరువాత ఛార్జీలు పెరగటంతప్ప తదనుగుణముగా సౌకర్యాలు పెరుగలేదనే విమర్శవుంది. ఈ విమర్శను తొలగించినతరువాత జాతీయీకరణ కార్యక్రమాన్ని కొత్తప్రాంతాలకు విస్తృతముచేస్తే బాగుంటుందనే భావం ప్రబలంగా వుంది.

విద్యారంగంలో అభివృద్ధి ప్రముఖముగానే కనిపిస్తోంది. రాష్ట్రంలో 28 వేల పాఠశాలలు, 64 కళాశాలలు, 31 వృత్తికళాశాలలు వున్నాయి. సాంకేతిక విద్యారంగంలో అభివృద్ధి బాగావుంది. ఆరు ఇంజనీరింగ్ కళాశాలలు, 16 పాలిటెక్నికులు, మైనింగ్ సంస్థలు రెండు వున్నాయి. ఇటీవల తిరుపతిలో ప్రారంభమైన కళాశాలతో సహా రాష్ట్రంలో మొత్తం 8 వైద్యకళాశాలలు వున్నాయి. పాఠ్య పుస్తకాలను జాతీయం చేయదలచినందున హైదరాబాద్‌లో ఒక ముద్రణాలయమును ఏర్పాటుచేశారు. కాని పాఠ్యపుస్తకాలు సరిగా అందటంలేదని దేశంలో గగ్గోలుగావుంది. ఈపరిస్థితి తొలగే వరకు ఈ మార్పు ఎంతవరకు వాంఛనీయమో చెప్పటం కష్టం.

ప్రతిగ్రామానికి పాఠశాల, పంచాయతీ, సహకారసంఘం వుండాలని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ సూచించారు. ఈ విషయంలో కూడా ఆంధ్రప్రదేశ్ ముందంజవేసి ప్రధానమంత్రి ప్రశంసలను అందుకున్నది. పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టంచేసి పరిపాలనా వికేంద్రీకరణసూత్రమును అమలు జరిపారు. "ఆంధ్రప్రదేశ్, రాజస్థాన్ ప్రభుత్వాలు చేసినపని విప్లవాత్మకమైంది. వస్నూరాళ్లనుండి వాటాయిచ్చి పంచాయతీలకు అధికారాలు వప్పగించారు" అని ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రశంసించారు.

ఆంధ్రరాష్ట్రంలో 14 వేల పంచాయతీలు వున్నాయి. అందులో 12 వేలకు ఎన్నికలు జరిగాయి. 250 పంచాయతీ సమితులు



# ఆంధ్రప్రదేశ్

ఏర్పడ్డాయి. గ్రామాలవారీగా పథకాలు తయారుచేసి అభివృద్ధి కార్యక్రమాన్ని నిర్వహించాలని ఆలోచిస్తున్నారు.

ద్వితీయ ప్రణాళికక్రింద కేటాయించిన రు 175 కోట్ల 74 లక్షలు పూర్తిగా ఖర్చు కాగలదని ఆశిస్తున్నారు. మొదటి నాలుగు సంవత్సరాలలో రు 188.62 కోట్లు ఖర్చు అయింది. మిగిలిన మొత్తము ఆఖరు సంవత్సరం ఖర్చు చేయనున్నారు.

అభివృద్ధిపొందుటకు మనిషికి మనశ్శాంతి ఎంత అవసరమో ప్రభుత్వాలకు స్థిరత్వము అంత అవసరము. ఆంధ్రప్రదేశ్ ఏర్పడినతరువాత ప్రథమ ముఖ్యమంత్రిఅయిన శ్రీ సంజీవరెడ్డి ప్రభుత్వానికి స్థాయి, స్థిరత్వము సంపాదించిన కీర్తి సంపాదించుకొని కాంగ్రెసు అధ్యక్షులై వెళ్ళిపోయారు. పోతూ పోతూ శ్రీ సంజీవరెడ్డి రాష్ట్ర పరిపాలనకు ఒక వారసుడిని ఏర్పాటుచేసి పోవాలనుకున్నారుగాని ఆ ఆలోచనలు కొనసాగలేదు. ఆంధ్రప్రదేశ్ శ్రీ దామోదరం సంజీవయ్యను ముఖ్యమంత్రిగా ఎంచుకొని యావద్భారతదేశంలో ప్రప్రథమముగా హరిజన్‌ను ముఖ్యమంత్రిగా ఎన్నుకున్న కీర్తిని గడించుకున్నది. కాని సాధారణ ఎన్నికలను ముందుపెట్టుకొని, తృతీయ ప్రణాళికను సిద్ధము చేయవలసిన తరుణములో రాష్ట్ర పరిపాలనను సాగిస్తున్న కాంగ్రెసు పక్షములో వుండవలసిన ఐకమత్యము లేకపోగా అసలుకే మోసం వస్తుందా అనే అనుమానానికి అవకాశం కనిపిస్తోంది. ఈ మంత్రివర్గం ఏర్పడి ఆరునెలలైనా తిరుగకముందే ప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల సంఘం ఎన్నిక విషయంలో వివాదము రావటం, తత్ఫలితముగా ఒకమంత్రి పదవికి రాజీనామాయిచ్చి తప్పుకోవలసి రావటం జరిగింది. అది అంతటితో అగక ప్రదేశ్ ఎన్నికల సంఘాన్ని రద్దుచేసి మరల ఎన్నిక జరగాలని కాంగ్రెసు అధ్యక్షుడు ఆదేశించటంతో ప్రదేశ్ కాంగ్రెసులో అంతర్గతముగావున్న వైమనస్యము మరొకసారి విజృంభించుటకు అవకాశము దొరికింది. ఈ సందర్భములో మూడురకాల అభిప్రాయాలు వున్నట్లు తెలుస్తున్నది. మంత్రివర్గం యథాతథముగా వుండాలనే వర్గము ఒకటి, మంత్రివర్గము మారాలనే వర్గము మరొకటి, ముఖ్యమంత్రి మారకుండా మంత్రివర్గము మారాలనే వర్గము ఇంకొకటి మూడుగా వున్నట్లు రాజకీయ పరిశీలకులద్వారా తెలుస్తున్నది. మంత్రివర్గ ప్రతికూల అనుకూల వర్గాలు బలాబలాలు తేల్చుకొనుటకు సిద్ధపడుతున్నారు. ఘర్షణకు తలబడ్డ ఈ రెండు వర్గాలమధ్య సమాధానము కుదుర్చుటకు కాంగ్రెసు అధిష్ఠానవర్గము కృషిచేస్తోంది. వారి కృషి జయప్రదమై సర్వతోముఖాభివృద్ధిని సాగిస్తున్నందుకు ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ప్రశంసలను అందుకున్న ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి మరింత ఉత్సాహంతో కొనసాగి మరొకసారి ప్రధానమంత్రి ప్రశంసనేగాక ప్రజానీకం ప్రశంసనుకూడా అందుకొనగలదని ఆశిస్తున్నారు. 

## బహుమతి పొందిన కార్టూన్




# పొట్టి కథ

ఒక పెద్దమనిషి బస్ స్టాండ్ దగ్గర నిలబడి ఉన్నాడు. అంతలో యువకుడు ఒకడు వచ్చి ఆయన్ని టైము అడిగాడు. పెద్దమనిషి చెవిటివాడులా నటించి వినిపించుకోలేదు. ఆ యువకుడు వెళ్ళిపోయిన తర్వాత ప్రక్కనున్న మరో ఆసామీ 'అదేమండి చెవిటివానిలా నటించారూ' అన్నాడు. దానికా పెద్దమనిషి ఇలా అన్నాడు.

"అలా నటించాలనే నటించానండీ! వాడికి టైమెంతయ్యిందో చెప్పాననుకోండి, కొంతసేపు నా ప్రక్కనే నిలబడి తర్వాత 'రండి, కాఫీ త్రాగుదాం' అంటాడు. నాడు కాఫీకి తీసుకెళితే నేనూరుకుంటానా? అతని అడ్రసు తీసుకొని నా అడ్రసు ఇచ్చి ఒకసారి మా ఇంటికి భోజనానికి రమ్మంటాను. వాడు వస్తాడు. మా అమ్మాయి అన్నం వడ్డిస్తుంది. వాడు మా అమ్మాయిని ప్రేమిస్తాడు. మా అమ్మాయి కూడా వాణ్ణి గట్టిగా ప్రేమించేస్తుంది. పెళ్ళిచెయ్యాక తప్పదు. కాని, ఎంత అందంగా ఉంటే మాత్రం, వాచీలేని వెధవకు మా అమ్మాయి నిచ్చి పెండ్లి చేస్తే నా పరువేంగానూ? అదేం సుఖపడుతుంది?"

—కొప్పాల హేమాద్రి, (బొంబాయి.)

Printed and Published for NageswaraRao Estates (Private) Ltd., by S. Radha Krishna at the Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad